# శ్రీ పార్వతీ కళ్యాణము

(రంగస్థల నాటకము)

: రచయిత :


సహజకవి ; కవితాకళానిధి ; దైవజ్ఞరత్న ; అనుమునిగిరి ఆస్థానకవి

దేవరాయపల్లె పెంచల నరసింహాచార్యులు


కళాప్రవీణ శ్రీ రేబాల రమణ నిర్వహణలో
ప్రదర్శింపబడుచున్న నాటకరాజము

# శ్రీ పార్వతీ కళ్యాణము

## (రంగస్థల నాటకము)




: రచయిత :

సహాజకవి ; కవితాకళానిధి ; దైవజ్ఞరత్న ; అనుమునిగిరి ఆస్థానకవి

## దేవరాయపల్లె పెంచల నరసింహాచార్యులు

# SRI PARVATHI KALYANAMU

By.
Sahajakavi ; Kavithakalanidhi ; Daivagnarathna, Anumunigiri Aasthana Kavi
**Devarayapalle Penchala Narasimhacharyulu**

Copies : 1000

Price Rs.25/-

**For Copies**

**Devarayapalle Penchala Narasimhacharyulu**
Ch. Yedavalli (Village & Post)
Atmakur (Mandal), Nellore Dist. (A.P.)
Pin - 524 322.

Sri Parvathi Kalyanamu is published with the
Financial Assistance of Tirumala Tirupathi Devasthanams, Tirupati
under the scheme
"AID to Publish Religious Books"

**Printed at :**

**Sriven Offset Printers**
16/1064, Pogathota, Nellore.
Ph : 24506, 25040.

R.A. పద్మనాభరావు
స్టేషన్ డైరెక్టర్
ఆకాశవాణి—విజయవాడ.

విజయవాడ
24-7-95

# అభినందన సుమచందనం

దేవరాయవల్లెవారి పార్వతీకళ్యాణం నాటకం ప్రాచీనధోరణిలో సాగిన రసతుల్య పద్యరచనాశిల్పం. అది వారికి బాగా అలవడింది. రంగస్థల నాటకంగా యిది పలుప్రాంతాలలో ప్రదర్శితం కావడం దీని ప్రాచుర్యాన్ని తెలుపుతుంది.

"వైకుంఠునకు సాటి వచ్చునటందువా? బిడియమించుక లేని బిచ్చగాడు
బ్రహ్మదేవుని కంటె ప్రాజ్ఞుడంచందువా? కొంగజపములొనర్చు దొంగమౌని"

అనే సీసపద్యం శ్రీనాథుని ఎత్తుగడతో సాగింది.

ప్రాచీన నాటకశైలిలో సాగినా సంభాషణలు సులభరీతిలో సాగాయి.

సింగి భవిష్యద్వాణిని యానలో తెలుపడం సముచితం.

ప్రాచీనతకు స్వస్తివలుకుతున్న ఈ రోజుల్లో యిటువంటి నాటకం పెంచల నరసింహాచార్యులు ప్రచురించడం ముదావహం.

R. అనంత పద్మనాభరావు

శ్రీ

జయోస్తు! దిగ్విజయోస్తు!


# శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు

ఉపసంపాదకులు, పుస్తక ప్రచురణ విభాగము,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.


తే 17-10-95ది.

సహజకవి, కవితాకళానిధి, శ్రీ దేవరాయపల్లె పెంచల నరసింహాచార్యులవారి "పార్వతీ కళ్యాణ నాటకం" ఆ మూలాగ్రం అమందానంద సంభరిత చేతస్కుడనై చదివాను.

కవిత్వం శ్రీ నరసింహాచార్యుల వారికి, వారి తాతముత్తాతల నుండి సంక్రమించిన ఆస్తి. ఆయన పితామహ, ప్రపితామహులు మహాకవులు, శశిరేఖాపరిణయ, మార్కండేయ చరిత్రాది నాటకరచయితలు. బ్రహ్మవిద్యావేత్తలు. వీరి తండ్రిగారు సుబ్బయాచార్యులు సాహిత్యమూర్తి. మఱి నరసింహాచార్యులకు కవనమబ్బుటలో ఆశ్చర్యమేమున్నది? వారి "సహజకవి" బిరుద మీ విషయమునే వెల్లడించును.

దేవరాయపల్లె పెంచల నరసింహాచార్యులుగారు సింహపురమండలోన్నత పాఠశాలల్లో ఆంధ్ర పండితులుగా ఉద్యోగించి, ఎందరినో సాహితీ రసికులుగా తీర్చిదిద్దినవారు. వారి శిష్యులు తిరుపతిలో సమున్నత పదవులలంకరించి గురువర్యుల కీర్తి సరిహద్దులు పెంచుతున్నారు.

రెండు దశాబ్దముల నాటి మాట. నా చిరకాల మిత్రులు, విద్వత్కవి శ్రీ పూసపాటి నాగేశ్వరరావుగారు నెల్లూరు జిల్లా ఆత్మకూరులో సల్పిన అష్టావధానసభలో పృచ్ఛకుడుగా నేను పాల్గొన్నప్పుడు శ్రీ పెంచల నరసింహాచార్యులతో నాకు పరిచయమేర్పడినది. అది మూడు పూవులు, ఆరు కాయలుగ ముమ్మరించుచు నేడు నాచే ఈ రెండు మాటలు పల్కించుటకు కారణమైనది. నేను పెంచల నరసింహాచార్యులకంటే ఒకటి రెండేండ్లు పెద్దనైయుందును. వయస్సంబంధమైన ఆ పెద్దఱికముదప్ప రచయితగా, ఇంతకంటె గడుసరినై అభిప్రాయమొసగుట మాత్రము కాదు.

నాటకాంతంహిసాహిత్యమ్. పద్యగద్యరచయితలకంటె నాటక రచయిత ఎప్పుడూ గొప్పవాడే. నేను నాటక రచయితనుగాను, కేవల గద్యపద్యకవయితనే. అస్తు.

పార్వతీ కల్యాణము ఐదంకముల అపూర్వ రంగస్థల నాటకము. తెలుగునాట ముఖ్య కేంద్రములన్నిట ప్రదర్శింపబడుచు కవికి, ఎనలేని ఖ్యాతిని చేకూర్చినది.

దక్షాధ్వరవిధ్వంసము, పార్వతీ కల్యాణము అను రెండు సన్నివేశముల కమనీయమైన కలయికతో రూపుదాల్చిన మహోత్తమ, మంజుల రూపకము శ్రీ పార్వతి కల్యాణము. దక్షాధ్వరవిధ్వంసము నాల్గవ అంకములోని రెండవరంగము వరకు విస్తరించినది. కడమది పార్వతీ పరిణయ వృత్తాంతము.

శృంగార వీర కరుణాద్భుత హాస్యరసతుందిలములైన రుచిరసన్నివేశములతో అడుగడుగునకు శ్రవ్యప్రబంధముగా పాఠకునిలో, దృశ్యకావ్యముగా ప్రేక్షకునిలో ఉత్కంఠ రేకెత్తించు మహోదాత్తరచనమిది.

నాటకమందలి శబ్దార్థముల పోహళింపు ఉమామహేశుల దాంపత్యము వలె మదికింపుగొలుపుచు, ఈ మహనీయుని మతి వైశారద్యమును మింటికెత్తుచున్నది.

"పోయినదారినే పరువుపోయిన వాని విధానవచ్చితిన్" -

ఇటువంటి వాక్యములను అలవోకగా కుప్పలు పోయనేర్చిన మహాభావుకుడైన ఈ కవీంద్రుని గద్యపద్యములు కమ్మిచ్చునదీసిన బంగరు తీగలై కనులు మిరుమిట్లు గొనజేయుచున్నవి.

శివజటాజూట నిర్గత గాంగధునీ ప్రవాహానదృశములై ఆనంద వీచికలనోలార్చుచున్నవి.

ఇంతకంటే వ్రాయలేను.

కవిలోక వీరుడైన పెంచల నరసింహకవీశ్వరు
కవనకళావైదగ్ధికి నాకైవారములు.
స్వస్తి.

ముదివర్తి కొండమాచార్యులు.



"నటకళాభిజ్ఞ"
రేబాల రమణ
రంగస్థల, రేడియో, టి.వి. కళాకారుడు

నెల్లూరు
24-11-95

ఆ రోజుల్లో -

అంటే, నేను నెల్లూరు జిల్లాకే పరిమితమై, సంగు, లచ్చి, శాంతిమతి, సుభద్ర మొదలగు పాత్రలకే పరిమితమై నాటకాలాడుతున్న రోజులవి.

అప్పుడు నెల్లూరు జిల్లా ఆత్మకూరు మండలం బట్టేపాడు గ్రామంలో శ్రీ కోదండరామ నాట్యమండలి నన్ను స్త్రీ పాత్రలకు ఆహ్వానిస్తుండేవారు. ఆ సమాజంలో అప్పటికే అరవై సంవత్సరాలు నిండిన, వృద్ధకళాకారుడు పట్నం ఈశ్వరయ్యాచార్యులవారు నా అభిమాని. వారొకరోజు నెల్లూరు సుబేదారుపేటలో నా కళానిలయానికి వచ్చారు. వీరభద్ర విజయం నాటకంలో దాక్షాయణి పాత్ర వేయాలని కోరారు. కొత్త పాత్రలు నేర్చుకొనే తీరుబాటులేదన్నాను. ఒక్కసారి చదువు, ఇష్టంలేకపోతే మానుకోమని బలవంతంగా పోర్షన్ యిచ్చి వెళ్ళారు. చదివాను. చదివిన తరువాత దాక్షాయణి వేషం వేయాలనిపించింది. నా అంగీకారం తెలుపుతూ వారికి వుత్తరం వ్రాశాను. నాటకం రోజు నా దాక్షాయణి పాత్ర, పండితపామరులనందరిని అలరించింది. ఆనాడు ఆ నాటక రచయిత నన్ను ఆలింగనంజేసుకొని, దాక్షాయణి పాత్రకు ప్రాణం పోశావు నాయనా అన్నాడు. ఇది ప్రథమ ప్రదర్శన సంగతి. దాక్షాయణి పాత్రలో "పిలువ వచ్చునో మా నాన్న పిలువ రాడో" అనే పద్యం నాకు ఎప్పుడు గుర్తుకు వచ్చినా నా శరీరం పులకరిస్తుంది. ఇప్పటికీ కవిగారు నన్ను కలసిన ప్రతి పర్యాయము రమణగారూ ఆ పద్యం చదవండి అంటారు. ఆయనకు ఆ పద్యమూ, దాన్ని నేను చదవడమూ ఎంత యిష్టమో!

ఇవన్నీ ఆనాటికి సంబంధించిన మాటలు -

ఈలోపల నేను ఉత్తరాది ప్రేక్షకులకు పరిచయము కావడమూ, ఆంధ్ర దేశమందలి అగ్రనటుల సరసన వైవిధ్యం గలిగిన ప్రముఖ స్త్రీ పాత్రలు ధరించడమూ అనేకానేక సన్మాన సత్కారాలందుకోవడము, బిరుద ప్రదానాలు స్వీకరించడము,

వివాహం చేసుకోవడము, సంతానాన్ని పొందడము అన్నీ జరిగేటప్పటికి దాదాపు ఇరవై సంవత్సరాలు జరిగిపోయాయి. ఆంధ్రదేశమంతా నాటకాలలో తిరిగి బాగా అలిసిపోయాను. కొంతకాలం విశ్రాంతి తీసుకొందామని ఇంటి వద్దనే నెల్లూరులో వుంటున్నాను. ఒకరోజు సాయంత్రం నేను ధరించిన పాత్రలన్నింటిని గుర్తుకు తెచ్చుకుంటున్న సమయంలో నాకు తెలియకుండానే "పిలువచ్చునో మా నాన్న పిలువరాదో", ఆలపిస్తున్నాను. ప్రక్కనే వున్న నా సహధర్మచారిణి శ్రీమతి శ్రీలక్ష్మి ఎక్కడిదీ కొత్త పద్యం అని అడిగింది. పార్వతీ కళ్యాణం నాటకంలోనిది అన్నాను. మరలా ఒకసారి చదవండీ అనింది. చదివాను. అరమోడ్పు కనులతో ఆమె వినేధోరణి చూచి పార్వతి వేషం వేస్తావా? అన్నాను. చిరునవ్వుతో వేస్తానన్నట్లు తలాడించింది. వెంటనే మా నాటక సమాజము వారిచే నాటకం ఆడాలని నిర్ణయించుకున్నాము.

తదుపరి ఈ నాటక రచయిత శ్రీ ఆచార్యులవారిని పిలిపించి, దేవాలయాలను దృష్టిలో వుంచుకొని నాటకం ఎడిట్ చేయించడము, నా భార్య శ్రీలక్ష్మిచేత దాక్షాయణి, పార్వతి పాత్రలు వేయించడము, ప్రముఖ పాత్ర నారదుడు నేను వేయడము, శ్రీ పున్నూరు సుబ్బారావు దక్షుడుగాను, శ్రీ కె. గంగాధరరావు ఈశ్వరుడుగాను, బండారు రవికుమార్ విష్ణువుగాను, ధరణికోట ఆంజనేయశర్మ దేవేంద్రుడుగాను, యింకా తదితరులతో నాటకం ఆరునెలల పాటు రిహార్సిల్సు చేసి, ఆంధ్ర దేశంలోని అన్ని ముఖ్య కేంద్రాలలో ప్రదర్శనిలిచ్చాము. హైద్రాబాద్ రవీంద్రభారతిలో గూడా యీ నాటక ప్రదర్శన జరిగింది. అన్ని ప్రదర్శనలు రక్తిగట్టాయి.

ఇక యీ నాటకం గురించి -

ఈ నాటకం ప్రదర్శన ప్రారంభం నుండి చివరి వరకు ఆహూతులైన ప్రేక్షకులను కదలనివ్వదు. మరీ స్త్రీ ప్రేక్షకుల్ని సమ్మోహన పరుస్తుంది. వారిని ఏడిపిస్తుంది, నవ్విస్తుంది, ఆనందింపజేస్తుంది. చివరన తృప్తిగా ఇంటికి పంపుతుంది. అందుకే యీ నాటకం అంటే నాకెంతో యిష్టం. అందులోని ప్రతి పాత్రకు సంబంధించిన ఏదో ఒక పద్యం ప్రతిరోజు నాకు గుర్తుకు వస్తుంటాయి.

చివరగా ఒక్క మాట -

శ్రీ ఆచార్యులవారితో, వారి కుటుంబ సభ్యులతో నాకు గత ముప్పయి సంవత్సరాలుగా సన్నిహిత సంబంధాలు వున్నాయి. వారు రచించిన పాటో, పద్యమో, పాడాలంటే నాకు చాలా యిష్టం.

అంతకంటే నాకమిత యిష్టమైంది, వారి కుమారులతో స్నేహం. ఆత్మీయతతో గూడిన వారి పలకరింపు నన్ను పులకరింపజేస్తుంది. వారి యిద్దరి కుమారులు వృత్తి కళాకారులుగాకపోయినా, ఈ నాటకంలో వేషాలు వేస్తారు. ఇంకో తమాషా ఏమిటంటే వీరి పెద్దబ్బాయి యీ నాటకంలో ధరించే ఎరుకలసాని పాత్ర నన్నెంతో ముగ్ధుణ్ణి చేస్తుంది. ఆ వేషంలో ఆయన హావభావాలు, హొయలూ, మాట తీరూ, నాకెంతో ముద్దొస్తాయి. ఈ నాటకంలోని నారదుని పద్యాలు విజయవాడ ఆకాశవాణి వారు ప్రసారం చేశారు.

చివరగా యింకో మాట చెప్పకుండా వుండలేకపోతున్నాను.

శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామివారి పాత్రను ధరించాలని శ్రీ ఆచార్యులవారికి, నా కోరిక నెరింగించాను. అందులకు వారు సమ్మతించి, చాలా కొద్దికాలంలో వీరబ్రహ్మేంద్ర విజయం నాటకం రచించి శ్రీ ఆచార్యులవారూ, వారి పెద్దబ్బాయి శ్రీవీరబ్రహ్మాచారిగారు నాకు ప్రసాదించారు.

మా సమాజము ద్వారా యీ నాటకం తర్ఫీదు చేసి, ప్రదర్శనలిద్దామనుకుంటున్నాను. నా వయసుకు సరిపడే పాత్రగా శ్రీస్వామివారి పాత్రను నిర్ణయించుకున్నాను. ఆ పాత్ర సంస్మరణ మాత్రగా గుర్తుకు వస్తేనే, నా మనసూ, నా శరీరమూ ఏదో అలౌకిక ఆనందంలోకి వెళుతుంది. జేజినాయన నన్నావహించి, నాచే పవిత్రమైన యీ పాత్రను ప్రదర్శింపజేస్తాడని విశ్వసిస్తున్నాను.

శ్రీ ఆచార్యులవారి ద్వారా జేజినాయన రూపంలో
త్వరలో మీ ముందుకు వస్తున్నాను.

ఇక వుంటామరి.

మీ

రేబాల రమణ

సుబేదారుపేట,

నెల్లూరు.

# నా మాట

ఇది 1963, 64 సంవత్సరాలనాటి మాట.

అంటే - 30 సంవత్సరాల క్రిందటి రోజులు గుర్తుకు వస్తున్నాయన్నమాట.

ఆ రోజుల్లో నేను ఆత్మకూరు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో గ్రేడు II తెలుగు పండితుడుగా ఉద్యోగం చేస్తూవున్నాను. బట్టేపాడు మా అత్తగారి గ్రామం. ఆ గ్రామంలో నాకు అత్యంత ఆప్తులు, సోదరసమానులు వుండేవారు. వారిలో తూమాటి నారపరెడ్డి, పట్నం ఈశ్వరయ్యాచార్యులు ముఖ్యులు.

ఈశ్వరయ్యాచార్యులు గారు విశ్వబ్రాహ్మణ వంశజులు. వారు అప్పుడప్పుడు శ్వరకవి రామకృష్ణయ్య కవిగారిచే రచింపబడిన "వీరభద్రవిజయము" అనే వీధి నాటకాన్ని చదువుతుండేవారు. వారు ఒకరోజు ఆ వీధినాటకాన్ని నా వద్దకు తీసుకొనివచ్చి, ఈ కథను ఇతివృత్తంగా తీసికొని స్టేజీ నాటకంగా వ్రాసియిమ్మన్నారు.

అప్పుడు నా బిడ్డలు చదువుల్లో వున్నారు. పెద్దబ్బాయి. వీరబ్రహ్మాచారి S.S.L.C. ఆత్మకూరు హైస్కూల్లో చదువుతున్నాడు. నేను చాలా యీతి బాధల్లో వున్నాను. ప్రస్తుతం నా మానసిక పరిస్థితి సరిగాలేదు. రెండు నెలల తర్వాత చూస్తామన్నాను. అది మాఘమాసము, ఉగాదికి నాటకం వేయాలన్నాడు. నా ఆర్థిక బాధలకు ఆదుకొంటానన్నాడు. అలాగే ఆదుకొన్నాడు గూడా.

కొంత డబ్బు అప్పుగా యిచ్చినాడు. ఏ రోజుకారోజు సాయంత్రానికి ఆత్మకూరు వచ్చి పద్యాలు వినేవాడు. పద్యం నచ్చితే తెగ సంబరపడిపోయేవాడు. నచ్చకపోతే పద్యాన్ని మార్చమనేవాడు. అదే భావానికి ఛందస్సు మార్చమనే వాడు. ఛందస్సు మార్చేవాణ్ణి. శబ్దం నచ్చకపోతే పదం మార్చమనేవాడు. దాదాపు ఒకనెల రోజుల్లో చిత్తు ప్రతి తయారైంది.

ఎలా ఆడించాడో నాకు తెలియదుగానీ, బట్టేపాడు శ్రీ కోదండరామ నాట్యమండలి వారిచే ఉగాదికి నాటకం ఆడించాడు. అప్పుడు రేబాల రమణ దాక్షాయణి పాత్ర ధరించారు. "పిలువవచ్చునో, మా నాన్న పిలువరాడో" అనే పద్యం చదువుతూంటే నా శరీరం.... పులకరించింది. ఈ పద్యం నిజంగా నేనే వ్రాశానా? అనిపించింది. ఆ సీను తర్వాత వేదిక మీదకు వెళ్ళి ఆయన్ను ఆలింగనం చేసుకున్నాను.

అదే రమణ గారు మరలా పది, పదిహేను సంవత్సరాల తర్వాత ఆచార్యులవారూ "పార్వతీ కళ్యాణం" నాటకాన్ని దేవాలయనాటకాలకు సిద్ధం చేసి యివ్వండి", అన్నప్పుడు ఎంతో ఆనందించాను. నెలరోజులు నన్ను, మా పెద్దబ్బాయి వీరబ్రహ్మాచారినీ నెల్లూరులో పోషించారు. వారికి కావలసిన రీతిలో నాటకానికి రూపాన్ని యేర్పాటు చేసుకున్నారు. మా పెద్ద అబ్బాయి వీరబ్రహ్మాచారిని "ఎరుకలసాని" పాత్రవేయమన్నారు. నేడు ఆంధ్రదేశమంతటా ప్రదర్శిస్తున్నారు.

ఇదిలావుండగా - ఒకరోజు సోదరసమానులు, శ్రీ పూనపాటి నాగేశ్వరరావుగారితో ప్రసంగవశాత్తు ఈ నాటకముద్రణకు మార్గమెలా ? అని అడిగాను. నాటకాన్ని శుద్ధప్రతులు తయారు చేసి శ్రీ తిరుమల. తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయం కొఱకు ప్రయత్నించండి అన్నారు. అలాగే ప్రయత్నించాను. శ్రీ వేంకటేశ్వరస్వామి కృపవలన నేటికో రూపాన్ని పొందగలిగాను. నేను కోరిన వెంటనే తమ అమూల్యాభిప్రాయాన్ని అందజేసిన విజయవాడ స్టేషన్ డైరెక్టరు శ్రీ ఆర్. అనంత పద్మనాభరావుగారికీ, శ్రీముదివర్తి కొండమాచార్యులగారికి కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తున్నాను.

నా మీద ఎల్లప్పుడూ తన వాత్సల్యపూరిత దృక్కుల్ని ప్రసరించే మా కొండమన్నకు నేనెంతయో ఋణపడియున్నాను.

ఈ నాటకానికి చక్కని ప్రదర్శనలేర్పాటు చేస్తున్న శ్రీ రేబాల రమణగారికి కూడా కృతజ్ఞతాభివందనలందజేస్తున్నాను.

ఈ నాటకానికి అందమైన అచ్చు కూర్పునిచ్చిన శ్రీవెన్ కంప్యూటర్స్‌వారికీ కృతజ్ఞతలందజేస్తున్నాను.

ఈ నాటక ముద్రణకు శ్రమ తీసుకొని ప్రయత్నించిన మా చిరంజీవులు వీరబ్రహ్మాచార్యులను, నాగార్జునాచార్యులను ఆశీర్వదిస్తున్నాను.

ఈ నాటకానికి ఆర్థిక సహాయంజేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి మరొక్కమారు కృతజ్ఞతాభివందనములందజేస్తూ ముగిస్తున్నాను.

మీ

## శ్రీ పార్వతీ కళ్యాణము నాటకంలో నేటివరకు నటించిన నటీనటులు మరియు సాంకేతిక బృందము

సర్వశ్రీ

ఈశ్వరుడు : 1. V. వీరమోహన్ (రేవూరు)
2. S. గంగాధరరావు B.A., B.Ed.,

హిమవంతుడు : 1. T.V. నరహరి (ఆత్మకూరు)
2. తూమాటి రామిరెడ్డి (బట్టేపాడు)
3. N. రవికుమార్ (నెల్లూరు)
4. మన్నె రామిరెడ్డి

నారదుడు : 1. T. పెంచలరెడ్డి (సాయిరాం కాలేజి, ఆత్మకూరు)
2. T.V. నరహరి (ఆత్మకూరు)
3. నటకళాభిజ్ఞ రేబాల రమణ

చండీశ్వర : 1. S. శంకరయ్య (బట్టేపాడు)
2. D. రాఘవయ్య (బట్టేపాడు)
3. K. రామలింగారెడ్డి

ముండీశ్వర : 1. D. వీరబ్రహ్మాచారి
2. G. పుల్లారెడ్డి

దక్షుడు : 1. వాశిపల్లి వెంకురెడ్డి (బట్టేపాడు)
2. T. జయనాధ ప్రసాద్
3. పున్నూరు సుబ్బారావు

వీరభద్రుడు : 1. Sk. ఖాదర్ (తూర్పుకంభంపాడు)
2. T. రామిరెడ్డి (బట్టేపాడు)

సూర్యుడు : 1. పట్నం ఈశ్వరయ్యాచార్యులు (బట్టేపాడు)

విష్ణు : 1. T. దాశరథి (కళామందిర్, నెల్లూరు)
2. బండారు రవికుమార్
(బండారు రామారావుగారి కుమారుడు)

| | | |
|---|---|---|
| దేవేంద్రుడు | : | 1. D. నాగార్జునాచారి |
| | | 2. ధరణికోటి అంజనేయశర్మ (నక్షత్రక ఫేం) |
| మన్మథుడు | : | 1. D. రాఘవయ్య (బట్టిపాడు) |
| | | 2. M. గున్నేశ్వరరావు (నెల్లూరు) |
| దాక్షాయణి, పార్వతి | : | 1. నటకళాభిజ్ఞ రేబాల రమణ |
| | | 2. శ్రీమతి రేబాల శ్రీలక్ష్మి |
| హార్మోనిస్టు | : | 1. సుబ్రహ్మణ్యం (తెనాలి) |
| | | 2. వగిడి ఓబయ్య (నెల్లూరు) |
| | | 3. T. శ్రీనివాసులు (నెల్లూరు) |
| తబ్లా | : | 1. Sk. ఖుద్దూస్ |
| | | 2. మోహన్ జనార్ధన్ |
| మేకప్ | : | 1. P.M. ప్రసాద్ |
| | | 2. Sk. అల్లాబక్షు |
| | | 3. Sk. మహబూబ్ బాషా |
| | | 4. D. వెంకటాద్రి |
| వయొలిన్ | : | రాజారావు |
| సీన్లు, డ్రస్సులు | : | రేబాల రమణ డ్రామా డ్రెస్సెస్ |
| స్పెషల్ ఎఫెక్ట్స్ | : | జి.వి. రెడ్డి |
| స్టిల్స్ | : | ఉషా కృష్ణమూర్తి |
| సంగీత దర్శకత్వం | : | "కళాప్రవీణ" రేబాల రమణ |
| పర్యవేక్షణ | : | డా॥ C.A. ప్రసాద్ |

☆☆☆☆☆

# శ్రీ పార్వతీ కళ్యాణము నాటకమునందలి నిశ్చలన చిత్రాలు



నారద : రేబాల రమణ



దక్షుడు : పున్నూరు సుబ్బారావు



ఈశ్వరుడు : S. గంగాధరరావు
B.A., B.Ed.,

## శ్రీ పార్వతీ కళ్యాణము నాటకమునందలి నిశ్చలన చిత్రాలు

- దక్షయజ్ఞమునకు ఈశ్వరునాహ్వానిస్తున్న దక్షుడు
- దక్షయజ్ఞమునకు వెళ్ళిరమ్మంటున్న నారదుడు
- పుష్పకోనం లొట్టలు వేస్తున్న చండీశ్వర, ముండీశ్వరులు
- అందరూ కలిసియున్న ఒకానొక ఘట్టం
- దక్షయజ్ఞం తర్వాత ఘట్టం
- ఈశ్వరు నారాధిస్తున్న పార్వతి
- పార్వతిని చేపట్టమంటున్న హిమవంతుడు
- ఏకాంతమున ఆలోచిస్తున్న దక్షుడు (జయనాధ ప్రసాద్)

☆☆☆☆☆

# శ్రీ పార్వతీ కళ్యాణము

(రంగస్థల నాటకము)

రచయిత

సహజకవి, కవితాకళానిధి, దైవజ్ఞరత్న, అనుమునిగిరి ఆస్థానకవి

**దేవరాయపల్లె పెంచల నరసింహాచార్యులు**

## ప్రార్థన

కం|| *శ్రీ విఘ్నేశ్వరు దలచెద*
*నే విఘ్నములేక కథకు నింపును సొంపున్*
*రావించి నాదు కవితన్*
*ధీవినుతుల్ మెచ్చునట్లు దీవన లిడగన్.*

కం|| *పలికెడిది శంభుచరితము*
*పలికించెడివాడు శైవభావుడు, శివుడే,*
*పలికెద విధేయతాగుణ*
*కలితుడనై పూర్వకవుల కరుణార్థినినై.*



# శ్రీ పార్వతీ కళ్యాణము

(రంగస్థల నాటకము)

(ప్రథమాంకము - 1వ రంగము)

## నాంది

శా|| శ్రీ కైలాస గిరీంద్రవాసియగు విశ్వేశున్మహాదేవులో
కైకారాధ్యను మాధవున్శివుని దిక్కైక్రమొక్కి ప్రార్థింతు నా
యీ కావ్యంబు రసాన్వితంబయి ప్రజానీకంబు గీర్తింపగా
రాకాచంద్రుని పోల్కియై భవుని శీర్షంబందు వెల్గొందగన్!

ఉ|| మామ మదించి నిన్ననిన మాటలనెల్ల కళాప్రవృత్తితో
వేమరు పల్కినందులకు విశ్వము కిన్కవహించి, నన్ను మీ
మామగ లెక్కగట్టి, దయమాలి దురూక్తుల బల్కునేమొ శం
భో మహాదేవ! నీ కరుణ పొల్పునదాని నదల్పుమో ప్రభూ!

## ప్రస్తావన

సూత్రధారుడు : (ప్రవేశించి) మారీషా! త్వరగారమ్ము.

మారీ: వస్తున్నా బావా!

సూత్ర : మారిషా! ఈ మహాజన సందోహం, ఆనందవార్ధి[illegible]నట్లుగా "శ్రీ పార్వతీ కళ్యాణమ"ను నాటకమును [illegible]లయును. పాత్రధారులందరూ సిద్ధమే.కదా!

మారీ: సిద్ధమే బావా! అయితే... ఈ పార్వతీ కళ్యాణం నాటకాన్ని ప్రదర్శించిన వారికీ, చూచి ఆనందించిన వారికీ భుక్తి, ముక్తులు లభిస్తాయంటారే.... నిజమేనా బావా!

సూత్ర : అందుకు సందేహామే లేదురా!

మారీ: బావా! ఈ "పార్వతీ కళ్యాణం" నాటకాన్ని రచించిందెవరో నీ
తెలుసా?

సూత్ర : తెలుసా! అని చిన్నగా అడుగుతావేంరా దద్దమ్మా! ఆ కవిగారి వం
పారంపర్యాన్ని గురించి, ఈ నాటకం పుట్టుపూర్వోత్తరాల గురిం
గూడా నాకు బాగా తెలుసు.

ఈ నాటక రచయితయైన శ్రీ దేవరాయపల్లె పెంచ
నరసింహాచార్యుల ప్రపితామహులైన మునలయ్యాచార్యులుగా
మార్కండేయ నాటకాన్ని రచించి, వాసిలి వరదరాజస్వామి వారి
అంకితమిచ్చియున్నారు. వారి తమ్ముడైన ఈశ్వరయ్యాచార్యు
బిల్హణీయము -"నరకాసురవధ" అను రెండు నాటకములను రచిం
దుర్గాదేవికి అంకితమిచ్చియున్నారు.

పెంచల నరసింహాచార్యుల పితామహులైన వీరయ్యాచార్యులుగా
మహాకవులనీ, బ్రహ్మవిద్యావేత్తలనీ, అనేకమంది శిష్యపరంప
గల్గినవారనీ ప్రఖ్యాతియున్నది. వీరు చెంచితనాటకమ
శశిరేఖాపరిణయము అను రెండు యక్షగానములను
"పాండురంగచరిత్ర" అను హరికథను, విశ్వనిర్ణయమ
పంచబంధవిముక్తి అను అధ్యాత్మిక గ్రంథములను రచించియున్నార
తాను రచించిన చెంచితనాటకం యక్షగానంలో " నరసింహస్వామి
- వేషమును ప్రఖ్యాతిగా నటించెడివారని గూడా ప్రతీతి గలదు.

వీరి కుమారులు - అనగా శ్రీ పెంచల నరసింహాచార్యుల తండ్రిగారై
సుబ్బయ్యాచార్యులు గూడా కవిత్వము సందర్భినివేశమున
గలిగియుండియు, ఎట్టికృతికిని ఆకృతి నిచ్చియుండలేదు. వీరు మం
స్వర్ణకార శిల్పులు.

ఇకపోతే - శ్రీ పెంచల నరసింహాచార్యులుగారు క్రీ.శ. 1966 లో
బట్టేపాడు గ్రామంలో జిల్లాపరిషత్ హైస్కూలులో తెలుగ
పండితులుగా పనిజేయుచు, శ్రీ పట్నం ఈశ్వరయ్యాచార్యులు, శ్రీ
తూమాటి నారపరెడ్డిగార్ల ప్రోత్సాహంతో ఈ పార్వతీ కళ్యాణ
నాటకాన్ని రచించినట్లు తెలియుచున్నది. బట్టేపాడు గ్రామంలో శ్రీ
తూమాటి నారపరెడ్డిగారు నాటకసమాజాన్ని స్థాపించినవారు. శ్రీ
పట్నం ఈశ్వరయ్యాచార్యులుగారు దాని ప్రవృద్ధికై పాటుబడినవారు

ఈ నాటకాన్ని బట్టేపాడు శ్రీ కోదండరామ నాట్యమండలి వారు (శ్రీ
పంగివారుగు వీరారెడ్డిగారు నాయకపాత్రయైన పరమేశ్వరుడుగను
శ్రీ వాశివల్లి వెంకురెడ్డిగారు ప్రతినాయకపాత్రయైన దక్ష

ప్రజాపతిగను, కళాప్రవీణ శ్రీ రేబాల రమణగారు, నాయకి పాత్రయైన దాక్షాయణిగను) నాటి రోజులలో రెండు మూడు ప్రదర్శనలనిచ్చి ప్రముఖుల మన్ననలబొందియుండిరి.

నేడు శ్రీ రేబాల రమణగారి దర్శకత్వ నిర్వహణలో ఆంధ్రప్రదేశ్ నందలి ముఖ్యకేంద్రములన్నింట ప్రదర్శింపబడుచున్నది. ఇదీ - ఈ నాటకం యొక్క కథా - కమామీషూ.

నటి : అయితే... ఇక నీ నాటక ప్రదర్శన ప్రారంభింతమా బావా!

సూత్ర : అటులనే ప్రారంభింతము నటీ.

(నిష్క్రమింతురు)

☆☆☆☆☆

# శ్రీ పార్వతీ కళ్యాణము నాటకము

(ప్రథమాంకము _ 2 వ రంగము)

దాక్షాయణీ విరూపాక్షులు తెర ఎత్తగనే ప్రవేశింతురు.
(హిమాలయా పర్వత ప్రాంతము)

విరూ :- దాక్షాయణీ! ఈ అనంత ప్రకృతి రామణీయకతకు కారకుడైన విరాట్‌పురుషుని ప్రతిభా విలాసములనెంతని కొనియాడగలము.... అదిగో .... అటుచూడుము.

సీ॥ *ఆవైపుచూడు మల్లదె చక్రవాకంబు*
*ప్రియురాలిచెంత శోభిల్లుచుండె*
*ఆవైపుచూడు మల్లదె పికాంగన గీతి*
*కాలాపనల ప్రియు మ్రోలనుండె*
*ఆవైపుచూడు మల్లదె కోతియిల్లాలు*
*పతికవుంగిలి బరవశతనుండె*
*ఆవైపుచూడు మల్లదె బర్హి మిధునంబు*
*పింఛముల్ విప్పి క్రీడించుచుండె.*

గీ॥ *అదిగో అల్లటుచూడుమా ముదిత హరిణ*
*దంపతులసొంపు పొదరిండ్ల! దనరుచుండె*
*ఎందుజూచిన ప్రకృతియానందశోభ*
*భాసిలుచునుండె తరుణదంపతులచెంత.*

దాక్షా :- జగన్నాధా! మాయాశ్రితులగు మిమ్మే ఈ ప్రకృతిశోభ పరవశింప జేయుచుండ ఇక సామాన్యుల విషయమై చెప్పవలసినదేముండును నాధా!

విరూ: సతీ !ఈ పక్షిశాబకముల కలకూజితములతో మిళితమై, మఱియొక నాదమేదోవినిపించుచున్నట్లున్నది. (ఒక్క అడుగు ముందునకు వేసి చెవియొగ్గి ఆలకించి ఆశ్చర్యముతో) ప్రభూ ఏ భక్తాగ్రేసరుడో - ఏ ఆర్తిలోనో మిమ్ము వేడుకుంటున్నాడు ప్రభూ! (నాధుని భుజము పట్టుకొని ) ఆలించు స్వామి!

విరూ: (నిశ్చలంగా నిలబడి పైకి జూచి) దాక్షాయణీ! ఆ భక్తుడు నీవలన బొందగోరిన వరాలకై నన్ను ప్రార్థించుచున్నాడు.

దాక్షా: నిటలాక్షా! మీకటాక్షాంచలముల అనుసరించు ఈ దాక్షాయణి స్వతంత్రించి శిష్టుల రక్షింప గలదా? దుష్టుల శిక్షింపగలదా? మహానుభావా! దాక్షాయణీ విరూపాక్షులు ఏకరూపమని భక్తకోటికి మాత్రం తెలియదా స్వామీ ! అందుచేతనే ఆ భక్తుడు నావలన పొందవలసిన ఫలితము కొఱకు మిమ్ముల ప్రార్థించుచున్నాడు. మరీ.... ఇంతకూ .... ఆ భక్త శిఖామణి యెవరై యుండునో?

విరూ: ఎవ్వరో కాదు కామినీ! ఈ పర్వతాధినేత హిమవంతుడు.

దాక్షా: ఓహో! హిమవంతుడా! అయినచో.... దర్శన మిత్తమా లోకేశ్వరా!

విరూ: (యోచించి తలపంకించి) సరే! నీవు కావలెనన్నదానిని నేను కాదనుట భావ్యము కాదు పరమేశ్వరీ! తప్పక దర్శనమిత్తము. కాని, నీవు ముందేగుము. నీవెనుక నేవచ్చెదను.

దాక్షా: మీ ఆజ్ఞాను వర్తిని పరమేశ్వరా ! ( అంటూ కొంచము తలవంచి నమస్కరించి, ఈశ్వరుని ముందువైపుగా లోనికేగును )

విరూ: (స్వగతము) దాక్షాయణీ దేవి హిమవంతునను గ్రహింప కుతూహల పడుచున్నది. కాదు....కాదు.... త్వరపడుచున్నది. కానిమ్ము. (అనుచు లోనికేగును)

(తెరదించ బడును)

---

ప్రథమాంకము (3 వ రంగము ) హిమాలయ పర్వత ప్రాంతము.

---

(తెర యెత్తబడును)

---

(హిమవంతుడు జింక చర్మముపై, పద్మాసనాసీనుడై, రుద్రాక్షమాలను చేత ధరించి, యోగ దండమును కుడి చేతి క్రిందనుంచుకొని, కమండలము ఎడమచేతి వైపున నుండగా ధ్యాన నిమగ్నుడై, ఓంకార నాద మొనర్చుచుండును).

దాక్షా: (అభయహస్తంతో) హిమవంతా! మహోన్నత దీక్షాపరతంత్రుడవై, అహర్నిశలొనర్చు నీయమోఘ తపంబున కచ్చెరువందితిని. నీ యీప్సితార్థంబేదో ఎరిగింపుము.

హిమ: (కన్నులు దెరచి, ఆశ్చర్యముతో లేచినిలువబడి) తల్లీ! జగదేకపావనీ! భక్తలోకచింతామణీ! ఇన్నాళ్ళకీ భక్తపరమాణువును కరుణించితివా దేవదేవీ!

శా॥ *వందేశాంకరీ శంభురాణి జననీ వందే జగద్రూపిణీ!*
*వందే భక్త హృదంతరాళ నిలయే వాణీరమా సేవితే*
*వందే నిశ్చల నిర్మలాద్భుత కృపావారాశి దాక్షాయణీ!*
*వందే మౌని సురార్చితాంఘ్రియుగళే వందే జగత్పావని!*

అంబా! నీ దివ్యస్వరూప సందర్శన భాగ్య విశేషమున, నాజన్మ తరించినది తల్లీ! నీవు నా యింటి ఆడబడుచవై, నా వంశమును తరింపజేయవలయుననియే నా కోరిక.

దాక్షా: హిమవన్నగాధినేతా! నీ కోరిక మన్నింప దగినదే.... కానీ, మరు జన్మలో నాకు భర్తగను, నీ కల్లుడుగను రూపొందుటకు పరమేశ్వరుని ప్రార్థించితివా!

హిమ: తల్లీ దాక్షాయణీ! మనసున నిన్నూ, వాక్కున శంభుని, కాయమున నిన్నూ, కర్మమున శివుని, ఆహర్నిశలూ నిద్రాహారములు విసర్జించి నిశ్చల చిత్తముతో, వేడుకొనుచున్నాను తల్లీ!

దాక్షా: హిమవంతా! నీ కోరిక సామాన్యమైనది కాదు.ఇందు మూలమున నేనీ అవతారము చాలింప వలసియున్నది. అందులకు నేనిచ్చగించిననూ, మరు జన్మమున నాకు భర్తయగుటకు పరమేశ్వరుడును నమ్మతింపవలసియున్నది.

నీ యదృష్టవశమున విరూపాక్షుడును ఇప్పుడే ఇచ్చటకు రాగలడు. నేను నీకు కుమారిగను, శంకరుడు అల్లుడుగను కాగలుగుటకు ఆ పరమేశ్వరునే ప్రార్థింపుము. భక్త సులభుడైన ఆ మహానుభావుడు తప్పక నిన్ననుగ్రహింపగలడు.

హిమ: అంబా! నీ మధుర వాగమృతసేచనముతో నా హృదయారామము పల్లవించినది తల్లీ! ఇక నా జన్మ తరించినట్లే కదమ్మా!

(ఇంతలో ఈశ్వరుడు అభయహస్తముతో ప్రవేశించును)

దాక్షా: నాథా! నమస్కృతులు.

హిమ: పరమేశ్వరా! భక్తవత్సలా! నన్ను ధన్యుని జేయ తరలి వచ్చితివా నీలకంధరా! నిన్నేనమ్ముకొని, నిరంతరమునీపాద సేవలో నిమగ్నుడనై యున్న ఈ భక్త పరమాణువును కరుణించి ఈ కుసుమాంజలి నందుకొమ్ము దేవా !

ఈశ్వ: హిమవన్నగాధినేతా! నీ మనోరథంబీడేరు గాక!

దాక్షా: నగాధినాథా! నీ జన్మ తరించినది. నీ కోరిక సిద్ధింప నున్నది. భక్త సులభుడైన ఫణిభూషణుడు పరమానంద భరితుడై, వరమీయ నున్నాడు. నాయనా! నీ యభీష్టమేదియో తెల్పుకొమ్ము.

హిమ: (పరమేశ్వరునకు మ్రొక్కుతూ)

దండకము: శ్రీకంఠ చండీశ్వరా! విశ్వకర్మేశ్వరా! మౌనిలోకేశ్వరా! సర్వ సర్వేశ్వరా! సాధురక్షామణీ! భక్త చింతామణీ! దేవ చూడామణీ!

మహాదేవదేవా! భవాభవ్యభావా! పరంజ్యోతిరూపా! పరేశా! మహేశా! దినేశ ప్రకాశా! నిటాలాక్షదక్షా! మహాయోగ దీక్షా! జగద్రక్ష దక్షా! మహేశా! విధాతాధినేతా! మహా సచ్చిదానందయోగీంద్ర బృందారకేంద్రాది సంసేవితా! సర్వ సర్వం సహానాయకా! సర్వలోకేశ్వరా!

జన్మజన్మాంతరంబందు ప్రారబ్ధకర్మ ప్రదోషంబుతోడై, మహామోహపాశంబునన్ బద్ధజీవుండనై, బుద్ధి సూక్ష్మంబునున్ లేక వ్యర్థుండనై, నేటి కీనాటికేదో మహాపుణ్యపాకంబునన్, నిన్ను నాకన్నులన్ గాంచగా గల్గితిన్, పంచ భూతాత్మకా! పంచవేదాత్మకా! పంచకృత్యాత్మకా పంచశీర్షాన్వితా! శాశ్వతానంద సందాయకా! మహామాయతో జన్మరాహిత్య మార్గంబునే నందుకోలేక యున్నాడనో దేవదేవా దయంజూడుతండ్రీ! నమస్తే! నమస్తే! నమస్తే! నమః (హిమవంతుడు ఈశ్వరుని కాళ్ళపై బడును)

ఈశ్వ: (హిమవంతుని లేవదీసి) భక్తాగ్రగణ్యా నీ మనోరథంబేదియో నివేదించు కొమ్ము.

హిమ: శేషభూషణా! నీయర్ధాంగి నాకుమారిగను, నీవు నా అల్లునిగను ధ్రువపొంది, నన్నూ, నా వంశమును తరింపజేయుమన్నది నా ప్రార్థన. ఈ ఫలాపేక్షతో సహస్రాబ్దములమండి, పవన పర్ణాంబు భక్షణుడనై, శీత వాతాతప బాధలనేని లెక్కింపక నిన్నే నమ్మి సేవించుచున్నాడ స్వామీ!

ఈశ్వ: హిమవంతా! ఈ నాటకమున ప్రధాన పాత్రవహించవలసినది దాక్షాయణి. అందులకామె సమ్మతించినచో నా కభ్యంతరమేముండును. ( అని దాక్షాయణి వైపు జూచును.)

దాక్షా: జగన్నాథా! మీ వాక్కు సర్వలోకాలకును శిరోధార్యమై యుండ నేనంగీకరింపక పోవుటయా? ఎంతమాటంటిరి ?

ఈశ్వ: కేవలమునేననుటయే కాదుదాక్షాయణీ! నూతనావతారము ధరించుటలో గల కష్టనిష్టురములు నీకు మాత్రము తెలియనివా? కాబట్టి ఆలోచించియే హిమవంతునకు మాట ఇమ్ము.

దాక్షా: సకల భువన భారవహులైన మీరు సాక్షిభూతులుగా నుండ, ఈ కించిత్కార్య భారము నా పై బడునా మహాదేవా! ఆమాత్రము నేను యోచింపకయే మాట యిత్తునా?

ఈశ్వ: దక్షపుత్రీ! అంతయోచన గలదాన వగుటచేతనే, ఈనాడు విహారార్థమని నన్నీ ప్రాంతమునకు దోడ్కొనివచ్చి నీ భక్తుడైన హిమవంతుని కోర్కె నెరవేర్చుటలో భారమంతయు నాపై మోపగల్గితివి. ఆడువారన్నింటను సమర్థురాండ్రుగదా.

దాక్షా: నాధా! త్రిలోకాధినాధా! అంతయు మీమహత్వమే గాదా!

ఉ|| *భూతిత్రిపుండ్రముల్ నుదుట పొల్పు వహింపగ చంద్రరేఖ వి*
*ఖ్యాత విభూషయై, తరుణకాంతులు జల్లగ, దివ్యపన్నగ*
*వ్రాతము హారదీధితుల వైఖరి జూపగ దేవతానదీ*
*శీతలతల్ వహించివిలసిల్ల దయామయ నీకు మ్రొక్కెదన్.*

(నారదుని ప్రవేశము)

---

నార: (లోపలనుండి పాటపాడుచూ ప్రవేశించి) పూజ్యులైన పురాణ దంపతులకు నమోవాకములు.

ఈశ్వ: ఓహో! నారదమునీంద్రుడా! విచ్చేయుము బ్రహ్మర్షీ!

దాక్షా: మునీంద్రా! సర్వ భూతములకు క్షేమమేగదా.

నార: ఆc.... ఆc.... ఎల్లలోకములకు క్షేమమే తల్లీ!

హిమ: నారదమునీంద్రా! నమస్కారములు.

నార: పర్వతరాజా! పరమేశ్వరానుగ్రహమున ఫలిత మనోరధుండవగుదువుగాక! (దాక్షాయణీ వైపు చూచి) జగదాంబా! నగాధినేత నాగభూషణునేదో అర్థింప వచ్చినట్లున్నాడు.

ఈశ్వ: కాదు నారదా! ధరాధరనాధుని ధన్యుని జేయుటకై, దాక్షాయణియే నన్నిటకు దోడ్కొని వచ్చినది.

నార: ఫణిభూషణా! దేనికైనా మీరు సుముఖులైనపుడే దాక్షాయణీ సాహచర్యముపయోగించును. మీ అర్ధాంగియైన ఆమె స్వయముగా నేది నిర్వహింపగలదు?

ఈశ్వ: అందులకామెనే ప్రశ్నింపుము నారదా!

నార: (దాక్షాయణీ వైపు జూచి) ఏమిటి తల్లీ!

దాక్షా: ఏమున్నది నారదా! హిమవంతుడు నన్ను తనకుమారిగ బడయగోరుచు సహస్రాబ్ధములనుండి తపమొనర్చుచున్నాడు.

నార: ఓహో! తమరు మూడవరూపు ధరింపనున్నారన్న మాట. భేష్!..... మంచిదమ్మా! చాల మంచిది.

దాక్షా: ఇందులకు పరమేశ్వరుడు కూడ అనుగ్రహించెను నారదా.

నార: ఆ.....ఆ..... అనుగ్రహించక తప్పునా తల్లీ! సరియే.... ఇంతకూ నాకునూ కొంత పని గల్పించితివన్నమాట. (స్వగతము) ఈ మహాత్కార్యమునకు ఈనాడే నాందీ ప్రస్తావనలు గావింతును. (పరమేశ్వరునివైపు జూచి) పరమేశ్వరా! పద్మ సంభవుడొనర్చు సత్రయాగమునకు మీరు విచ్చేయరా?

ఈశ్వ: మహామహులెల్లరు విచ్చేయునట్టి సత్రయాగమునకు నేను మాత్రమేల రాకుందును? తప్పక వచ్చెదను.

నార: మహాభాగ్యము ఫాలలోచనా! ప్రాలుమాలక తప్పకరండి. మాతండ్రి యొనర్చు యాగము కాబట్టి నాకును పిలువవలసిన బాధ్యతయున్నదిగదా! అమ్మా! దాక్షాయణీ! నాకు సెలవొసంగుదువా తల్లీ!

దాక్షా: నారదా! త్వరపడెదవేల? హిమవంతుని.....

నార: హిమవంతా! దాక్షాయణీ విరూపాక్షుల అనుగ్రహముచే నీ మనోరథంబీడేరగలదు. ఎంత అదృష్టవంతుడవయ్యా హిమవంతా!

ఈశ్వ: నగాధినేతా! నారదవాక్కులమోఘములు.

హిమ: ధన్యుడను పరమేశ్వరా! .... తల్లీ! నాకు సెలవా?

దాక్షా: నాయనా! సర్వకామ్యార్థ సిద్ధుడవై, వర్ధిల్లుదువు గాక.

☆☆☆☆☆

## ప్రథమాంకము (ప్రవేశకము)

### 4 వ రంగము.

తెరలేచునప్పటికి చండీశ్వర - ముండీశ్వరులు పద్మాసనము వేసి కూర్చుని చెక్కవలకల మీద వ్రాయుచుందురు.

ముండి: ఒరేయ్ చండీ.... ఇంతకూ ఆ ఉకారాంత పుల్లింగ శంభు శబ్దము వచ్చినోట్లేనంట్రా.

చండీ: ఆం.... రాకేం చేస్తుందిరా.

| | | |
|---|---|---|
| శంభుః | శంభూ | శంభవః |
| హే శంభో | హే శంభూ | హే శంభవః |
| శంభుం | శంభూ | శంభూన్ |
| శంభునా | శంభూభ్యాం | శంభుభిః |
| శంభవే | శంభూభ్యాం | శంభుభ్యః |
| శంభుభ్యాః | శంభుభ్యాం | శంభుభ్యః |
| శంభోః | శంభ్వోః | శంభునాం |
| శంభౌ | శంభ్వోః | శంభుమ |

అయితే నువ్వు చెప్పరా.... చూస్తాం.

ముండీ: (అదేశబ్దాన్ని అభినయంతో గడగడ చెప్పేస్తాడు. లేచి నిలువబడి) చండీ.... ఎన్నన్నా....మనం ఘటికులమేరా!

చండీ: ఆమాటకు శ్వాసించేవాడెవ్వడూ అడ్డుచెప్పడు (అంటూలేచి నిల్చుంటాడు.)

ముండీ: ఒకవేళ ఇప్పుడు మనం భూతాలమైనా, పూర్వ జన్మలో బ్రాహ్మణ పక్షులంగదట్రా, ఇంగువ గట్టిన గుడ్డవాసన పోతుందీ!....

చండీ: కట్టిన గుడ్డలంగాదురా దద్దమ్మా - తినబెట్టిన బిడ్డలం (అంటూ కొంచెం ముందుకు పోయి) ఒరేయ్ ముండీ అయితే .... ఇంతకీ మనది బ్రాహ్మణ జన్మే నంటావా?

ముండీ: నేననడంమేంటీ....ఆశంకరభగవానుడే.... మాట మాట వరసలో దాక్షాయణీ దేవి గారితో అంటూంటే ....నే స్వయంగా విన్నారా!

చండీ: ఎట్టా....ఏమన్నాడేంటీ.

ముండీ: ఏముంది.... అరోజు శివరాత్రటట.... మనమేమో అభోగం రంగసాని ఇంటి ముందు అంగలారుస్తూ కాచుకూర్చున్నామట. ఆభడవాముండేమో.... సుబ్బం భట్టుగాడికోసం వేచి యుండిందట.... ఆవిషయము మనకేం తెలుసూ....

చండీ: అంతే కదాట్రా మరి.

ముండీ: (విషయంపొడిగిస్తూ) ఆ సుబ్బంభట్టుగాడేమో.... తీరా దానిగుమ్మంవరకూ వచ్చి, మనల్ని చూచి.... వెనక్కి వెళ్లాడట. శివరాత్రి కావడంతో ఆరోజంతా మనకేమో తిండి తిప్పలూ లేవయ్యె....

చండీ: పైపెచ్చు రాత్రంతా నిద్రలేదయ్యె....

ముండీ: అఁ....అఁ....అఁ....అదే నేననేదీ.... ఒక్క ప్రొద్దుతో శివరాత్రి పూటా....శివునికోసం కాకపోయినా,

చండీ: రంగసాని నిమిత్తంగానైనా,

ముండీ: జాగారం చేశాంగాబట్టి.... మనమేమో.... పరమేశ్వరునకతి సన్నిహితులమయ్యామా.... ఇకపోతే ఆరంగసాని మనమాదిరే.... ఒక్కప్రొద్దుతోటి జాగారం కాకపోయినా,

చండీ: సుబ్బం భట్టుగాడికోసం జాగారం చేసింది కాబట్టి,

ముండీ: కాబట్టే.... కాస్త తేడాతో ఆడజన్మగా అమ్మగారి సన్నిధానంలో....పుష్ప అయిందట్రా.

చండీ: అయితే....శివరాత్రిపూటా యేభక్తితో జాగారం చేసినా శివసన్నిధానం లభిస్తుందన్నమాట.

ముండీ: అన్నమాటేంటి....నీబొంద.... ఉన్నమాటేరా! లేకుంటే చచ్చి భూతాలమైన మనం.... ఏభూతవైద్యుని చేతిలోనోబడి, బసవన్నచెక్క ప్రయోగంతో వీపు చిట్లగొట్టించుకొనే యోగం తప్పి.... శివసన్నిధానం లభించిందంటే.... శివరాత్రి జాగార ఫలితంగాక, మనమింకే గంగలో మునిగాంరా?

చండీ: భోగం రంగసాని బావినీళ్ళలో తప్ప....

ముండీ: (ఆలోచిస్తూ, చండీకి దగ్గరగా వచ్చి) ఒరేయ్.... చండీ.... ఇలాచూడు.... ఇంతకీ నిన్నటికథ సుఖాంతమా.... లేక దుఃఖాంతమా?

ఛండీ: హే.... హే.... హే.... హే కథరోయ్

ముండీ: హాఁ....హాఁ....హాఁ....హాఁ....హాదే....నీవూ....పుష్పా....

ండీ: ఓ....హో! అదా....సరే....నిన్నిక్కడుండమని....నేను పుష్పను వెంబడించానా? అలాగే.... అదేమోనన్ను తోట వరకూ తీసికెళ్ళిందిరా.

ఋండీ: అయితే.... దారిమధ్యలో....ఏమీ

ండీ: ఆఁ....ఆఁ.... వస్తున్నా.... అదీ....అంటే....అంటే....ఆ పుష్పా వెనక్కి తిరిగిచూడకుండానే.... వెళుతూ.... వయ్యారంగా నడుంతిప్పి.... చండీ....అన్నదిరా....

ఋండీ: (లొట్టలు వేస్తూ....ఎగిరి గంతేసి) అబ్బ....అన్నదీ....ఒరేయ్ నిజంగా....దానికి.... మనమీద కొంత ఇది....ఉందన్నమాటే.

ండీ: ఆఁ.... ఆఁ.... ఉందన్నమాటే.... లేకపోతే.... తననెత్తిమీద ఉన్నబిందె....స్వయంగా....తన చేతుల్తోనే....నా నెత్తిమీద పెడుతుందట్రా.

ఋండీ: అబ్బ.... పెట్టిందీ....(ఆశతో యింకా దగ్గరకు వచ్చి) ఆమహాదావకాశంలో మన విషయం.... కాస్త విన్నవించలేదంట్రా.

ండీ: ఆహా....అంతమంచి అవకాశం వృధాపోనిస్తానట్రా....అపును నేనేమన్నానో తెలుసా?

ఋండీ: (చెవులు రిక్కించి ఆతురతగా) ఆఁ....ఆఁ....ఏమన్నావేంటీ.

ండీ: పుష్పా....నువ్వు....నిజంగా....ఎంత....అందంగా వున్నావ్....అన్ననామాట వినిపించు కోకుండానే.... తన భుజానవున్న....ఆమోపెడు పిడిసిన బట్టలూ నాభుజాన వేసి....

ఋండీ: వేసి....వేసి....వేసి....(త్వరత్వరగా అంటూ)

ండీ: ఊఁ....కదలూ....అన్నదిరా....

ఋండీ: (విసుగు....నిరాశతో) ఛ....ఛ.... నువ్వెత్త దద్దమ్మవురా.... నీ బుఱ్ఱలో ఆలోచనా లేదు.... తెలివి లేదూ....

ండీ: అదేందిరా....అలా అంటావ్.... బుఱ్ఱ పగిలేంత ఆలోచనావుంది.... అందుకు పరిమోతాదులో తెలివీ వుంది.

ఋండీ: ఉంటే....నీకసలు ఉండనేవుంటే...కనీసందాని ఎడమ చెయ్యయినా పట్టుకోకుండా వుంటావట్రా.

ండీ: పట్టుకుందామనే అనుకున్నారా! కానీ....కానీ....కానీ....

చండీ: కానీ....కానీ....దాని కుడిచెయ్యి ఖాళీగా వుండడంచూచి కాన్త....ఝడుసుకున్నారా !

ముండీ: ఛ....ఛ....పుష్ప....అబలగదట్రా.

చండీ: కాదురోయ్.... అది.... చిత్తినీజాతి ఆడది....మొన్న ఢాకినీ గాడి చెంప బద్దపాటు.... నువ్వుచూడ లేదుగానీ, అరెరెరే.... బూరెలాపొంగిపోయిందిరా బాబు.

పుష్ప: (చంకలో బిందె....భుజాన పిడిసిన బట్టలూ వేసికొని చండీముండీలను చూడకుండా.... హొయలుగానడుస్తూ శృంగారగీతిక పాడుకుంటూ స్టేజీలో ఒకవైపు నుండి మరొక వైపుగా పోవును.)

చండీ: ఒరేయ్....పుష్పరోయ్....(అంటూ ముండి దగ్గరకు వచ్చి)

ముండీ: (పుష్పవైపుచూస్తూ బ్రతిమాలినట్లుగా) ఒసేయ్ పుష్పా కాస్త నిలబడవే... నీతోమాటవుంది.... (అంటూ....అంటూ....ఇద్దరూ లోనికెళ్ళుదురు.)

(తెరదించబడును)

(నారదుడు పాటపాడుకుంటూ తెరకు ముందు వైపున ప్రవేశించును.)

నార: (స్వగతము) పరమేశ్వరా నీ లీలలద్భుతావహములు తండ్రీ! మహామహులు సైతము భావింపజాలని ఈ యఖండ ప్రకృతిని తామస ప్రవృత్తిగల దక్షప్రజాపతి అర్థము చేసికొనగలడా? అతనికిది యసాధ్యము.

ఉ|| *దేవదయాంబురాశి జగదేకవిభూ! శివదేవదేవ నీ*
*భావమెఱుంగ జాలని యభాగ్యుల కావ్తుడెవండు సర్వదా*
*ఈవు సహాయమైదరియనేరికి నైనను భోగభాగ్యానం*
*భావనకెట్టి లోటు గను పట్టదు చంద్రకళాధరా! హరా!*

కానిమ్ము.... కానున్నది....కాకపోదు కదా! దాక్షాయణీ దేవి తాను మాటయిచ్చిన ప్రకారము హిమవంతుని పుత్రికగాక తప్పదు. శంకరభగవానుడాతని అల్లుడుగాక తప్పదు. ఆ మహోన్నత కార్యసిద్ధి కొఱకే ఈ దక్షవిరూపాక్షుల కలహామునాందీయైనదేమో! నేను మాత్రమెట్లు నిశ్చయింపగలను? కానున్నది కాకపోదు. రానున్నది రాకపోదు.....అని నేనూరకుండిన.... ధర్మసంస్థాపన ఎట్లు కాగలదు? నా విధి నేను నిర్వర్తించెదను.

గీ|| *కావరంబున మితిమీరి! కలహామునకు*
*కాలుదువ్వెడు దురితాత్మ! గర్వమునకు*
*శాస్తి యొనరించి ధర్మ సంస్థాపనమ్ము*
*జేయవాణీధవుండు సృష్టించెనన్ను*

(తనలో) కాన రసవత్తరమైన యీ ఘట్టమును చక్కగా పోషించెదను. బ్రహ్మసభనుండి తిరిగి వచ్చిన దక్ష ప్రజాపతి, ఈశ్వరునిపై, తనలో రేగిన కోపాగ్ని నెట్లు పశమింపజేసికొనుచున్నాడో గ్రహించి తదుపరి తగిన మార్గమాలోచించి, కలహాబీజమును మహావృక్షముగా పోషించి, నాకర్తవ్యమును తీర్చి దిద్దెదను. (అంటూ తెరలోపలకు పోవును)

దక్షుని మందిరము

(దక్షుడు కోపావేశముతో నటునిటు తిరుగుచుండును.)

దక్షుడు: వివేక హీనుని వలన తిరస్కృతి. విచక్షణారహితునివలన పరాభవము. ఈ షణ్మాత్రుడైన ఈశ్వరుని చేత హీనముగా చూడబడుటయా ? సహింపజాలడు. ఈ అభిమానధనుడైన దక్షప్రజాపతి, బ్రహ్మ

సభాధ్యక్షుడైన ఈ దక్షప్రజాపతి కేవలమొక బాలిశుడు చూపిన నిర్లక్ష్యతను సహించి వూరకుండుటయా? తగిన ప్రాయశ్చిత్త మొనర్చువరకు ఈదక్షుడు నిద్రింపడు.

నార: అన్నయ్యా! దక్షప్రజాపతీ! నమస్కృతులు.

దక్షుడు: (కోపావేశములో వినిపించుకొనడు)

నారదు: అన్నయ్యా! నమస్కారశతంబులు (పెద్దగా అరచును.)

దక్షుడు: నారదా! నీవా! రమ్ము.... తగిన సమయమునకే వచ్చితివి.

నారద: అన్నయ్యా! ఏదో..... విషమసమస్య నెదుర్కొన్నట్లున్నది.

దక్షుడు: ప్రస్తుతమిది విషమసమస్యయేయైనది.

నారదు: అంతటి విషమ సమస్యయేదో తెలిసికొనవచ్చునా?

దక్షుడు: ఆఁ....ఇందు రహస్యమేమున్నది? మొన్నటి సత్రయాగంబున **సర్వామరమునిగణ సమక్షంబున, ఆ నికృష్టుడు, పీడాలి పీనుగు** నింద్యుడు నాయెడల చూపిన నిర్లక్ష్యభావము, హృదయశల్యమై బాధించుచున్నది. వానికి తగిన ప్రాయశ్చిత్తమొనర్చువరకు నాకు నిద్రపట్టదు. ఈశాన్యాధిపతి నుజ్జగించి త్రిలోక విదితముగా నొక యజ్ఞమొనర్పదలంచితిని.

నారద: ఈశాన్యాధి పతియా! అనగా ఈశ్వరుడు – మీపెద్దల్లుడు - ఆఁ అంతపనియా అన్నయ్యా!

దక్షుడు: (కోపముతో) పె...ద్ద....ల్లు....డు. అదౌర్భాగ్యుని అల్లునిగా జేసికొని పాలవెల్లి వంటి పరిశుద్ధమైన మన వంశమునకు కళంకమాపాదింపజేసితిని. అధమాధముడగు నాతని తోడి బంధుత్వమునకు నేటితో తిలోదకములు. ఇక మీదట నీవు సైతమాతని పేరు నెచ్చటను ఉచ్చరింపగూడదు. నేను వినగూడదు.,

నారదు: అవును.... అనకూడదు.... వినకూడదు. అతడు త్రిమూర్తులలో నొకడైనంతమాత్రమున మీ కల్లుడుగాకపోవునా? మరి.... అల్లుడైన వాడు మామగారియెడల.... అందులో ప్రజాపతిత్వము బొందిన మామగారియెడల ఎట్లు ప్రవర్తింపవలెనో తెలియకపోవుటయా? పిన్నపెద్దల మధ్య.... సర్వసురముని గణ సమక్షంబున....బ్రహ్మవంశసంజాతుండగు శ్రీశ్రీ దక్షప్రజాపతిని జూచి ప్రత్యుద్ధానమొనర్పకుండుటయా? ఎంత నిర్లక్ష్యము.... ఎంతటి అహంభావము.... అన్నయ్యా ఈ తప్పు ఎసైరింపరానిదే.

దక్షుడు: ఆ పొగరుబోతుకు తగిన శాస్తి చేయనిదే నాహృదయము శాంతింపదు. సర్వబృందారకుల నాహ్వానించి, వెలివేసినట్లుగా నా బిచ్చగానిని తాకి తలచుకొనకయే యజ్ఞమొనర్పవలెను. అంతటితో గాని వాని బైసి బయటపడదు. ఆనాడు మాయిరువురిలోనధికులెవరో అమరలోకమే నిర్ణయింపగలదు.

నారదు: అదేమిటివన్నయ్యా! ఎప్పుడైనను, ఎక్కడైనను, మామయే అధికుడు. మొదటి మర్యాద మామకు, ఆవలి మర్యాద అల్లునకు....ఇది సామాన్యమానవులకు సైతము తెలిసిన విషయమే..... మరి అతని కేలతెలియదో....తెలిసి చేసినను, తెలియకచేసిననూ తప్పుతప్పే అప్రబుద్ధునకు చేయవలసిన శాస్తియే అది! మీయాలోచన సమంజసముగానున్నది.... మన అమ్మాయిని గూడ పిలువకయే, యజ్ఞము చేయుదురా ?

దక్షుడు: ఆఁ... ఏమి! కూతురు... అల్లుడు.. రానిదే యజ్ఞము కొనసాగదాయేమి?

నారదు: ఆఁ... నెరవేరకపోతుందా! పురోహితునికొఱకు పుణ్యకాలమాగునా? ఈశ్వరుడు రాకపోయినచో యజనమాగునని కాదు ఉద్దేశ్యము.... మనమేది చేసినను ఎల్లవారల నమ్మతిని పొందునదిగా నుండవలెను. మనమీదనెవముంచుకొనరాదు. ఆనాడు చూచియో చూడకనో అల్లుడు ప్రత్యుద్ధానమొనర్చలేదని, దక్షప్రజాపతి కూతును అల్లునిపిలువకయే, బార్హస్పత్యాగమొనర్చుచున్నాడు. అదితప్పుకాదా? అని కొందరైనను ప్రస్తావించకపోరు. కనుక.... ఒకమారటు వెళ్ళి.... నామకార్థముగా.... పిలిచి వారిమాట వారి ఒడిలో పడవేయుట చాల ఉచితమని నావూహ. తదుపరి.... మీయిష్టము.

దక్షుడు: నారదా! ఏధర్మమెట్లున్నను, ఇకమీదట మాత్రము అతని మొగము చూచుటనాకిష్టము లేదయ్యా!

నారదు: నీకేకాదన్నయ్యా! నాకును ఇష్టము లేదు. మనలో ఒకరికైన యవమానము మరియొకరికి కాదా?....కానీ మనము ఒకరికి చెప్పనేర్చినవారము.... ఒకరిచేత చెప్పించుకొనవలసి వచ్చునేమోయని.... నా సంశయము....అంతియే అన్నయ్యా.

దక్షుడు:.. (అటు-ఇటు....తిరిగి....కొంతసేపాలోచించి) తమ్ముడూ! అయితే ఆదౌర్భాగ్యుని గడప ద్రొక్కనిదే తప్పదందువా!

నారదుడు: నేననుటయే కాదన్నయ్యా!...నీవును ఆలోచించిచూడుము. ఈ సమయమున నీవెంత మర్యాద పాటించి పిలిచినను ఆ మొండి

పట్టువాడురాడు. అమ్మాయిని పంపడు. అది కారణముగా తప్పంతయునాతని మీదనే పెట్టవచ్చును.

దక్షుడు: సరే! తమ్ముడూ.... ఇదియును అతని తప్పు ఋజువరచుట కొకసదుపాయముగనే దోచుచున్నది.

ఉ|| *ఈవు వచించినట్లుచని ఈశుని బిల్తు ప్రియమ్ము తోడ, నా*
*భావమెఱింగియాతడును భక్తి ప్రవత్తిని మేళవించి సం*
*భావనలంబొనర్చిన, యపారకృపందిలకించి వత్తు బల్*
*కీవినటించెనా ప్రతిఘటించి, శపించివిదల్చివచ్చెదన్.*

నారదుడు: బాగు.... బాగు.... చాల చక్కగనున్నదన్నయ్యా నీవూహ మరి.... ఆలస్యమెందులకు ?

దక్షుడు: ఇప్పుడే పయనించెద....మరల....నీదర్శనం.

నారదుడు: యజ్ఞమునకు తప్పకవత్తును గదా.

దక్షుడు: సరియే.... వెళ్ళిరమ్ము.

నారదుడు: (వెళ్ళిపోవును.) తెరదించబడును.

నారదుడు: (తెరకుముందువైపునకు వచ్చి) (స్వగతము) హరిహరబ్రహ్మాస్వరూపుండవగు ఫాలలోచనా! సర్వకాల సర్వావస్థలందును, మీయానతి శిరసావహించుచున్నాడ. నాపాలబడుకార్యనిర్వహణకు కలహమే సాధనముగా నిర్ణయించితివి. కలహ సౌధంబు నిర్మించుటలో నా నేర్పు నిరూపించుకొనునవకాశమెప్పుడు వచ్చునాయని ఉవ్విళ్లూరుచుందును. అదృష్టవశంబున నీమామయగు దక్షుని వలన నీకు వాటిల్లిన కలహామేనాందీ ప్రస్తావన యైనది. ఇది యేరీతి పరిణమించినను, భారమంతయు నీదే ప్రభూ! నాకర్తవ్యమునేను నిర్వహింతును.

చం.|| *తనను తనూజగా బడయ దావసియైతుహినాచలుండు కో*
*రునువరమంచునెమ్మది నెఱుంగదు శాంభవి, నంతసిల్లితా*
*ననిన విధంబుగా జనన మందుట నిక్కము తేపామాపా కా .*
*వున నడిపింతు నీకథ నవోజ్జ్వల భావరసోచితంబుగన్.*

ఈ కథ కాలంబనము దక్షవిరూపాక్షుల విరోధము. ఆ కలహాబీజమును శాఖోపశాఖలతో విరాజిల్లుమహా వృక్షముగా పెంపొందింతును. నాశక్తి సామర్థ్యములుపయోగించిదక్షప్రజా పతిని నిటలాక్షునొద్దకు పంపగలిగితిని. గర్వాంధుడైన దక్షుని ప్రకృతి పరమేశ్వరునకు మిక్కిలి యవగతము. అందుచేతనే

దక్షుని పరమేశ్వరుడు గౌరవింపడు. గౌరవింపలేదన్న నెపమున దక్షుడు విరూపాక్షుని పరివరివిధములుగా దురూక్తులాడును. అంతటితో దక్షునిపాపము పండగలదు. దీని పర్యవసానము పరమేశ్వరునకే ఎఱుక.

## ద్వితీయాంకము

## (2వ రంగము)

( తెరలేచునప్పటికి శివుడు యోగనిష్ఠాగరిష్ఠుడై కూర్చునియుండును. దక్షుడు ప్రవేశించి కోపావేశముతో నటునిటు తిరుగుచు.)

దక్షుడు: ఏమీ! ఈనాడు సైతమీదురహంకారినన్నుజూచి ఈషణ్మాత్రమేని చలింపకున్నాడు. మొన్నటి సత్రయాగంబున పరాభవించినట్లె, నేడును పరాభవింపజూచినట్లున్నది. కాదేని.... అల్లుడగు వాడు మామకెదురువచ్చి, అర్ఘ్యపాద్యాదులతో పూజించి సగౌరవముగా అగ్రాసనాధిపత్యమీయవలసియుండ, కన్యనిచ్చిన మామనగు నేను వచ్చి కొంతకాలము వేచి యుండినను, అల్లుడైన వీడు కనులు మూసికొని, దొంగసన్యాసి వలె కూర్చుని యుండుటయా? పిలిచిచూచెదగాక!.

ఓరీ శంకరా! శివా! భవా! ఓహో! వినబడలేదా? వినియు, విననట్లు, నటించుచున్నావా? హూం....ఏమి చూచుకొనిరా నీకీగర్వాంధకారము.... ఆగర్భశ్రీమంతుడవై, అష్టైశ్వర్యోపేతమున ఇంద్రభోగంబులదేలియాడు వాడవనియా నీధీరత్వము....హూం దౌర్భాగ్యుడా! దరిద్రదేవతతలపై, తాండవింప, పూటకూటికి సైతముగతిలేక, కపాలధారివై, "భిక్షాందేహి" అని నేటికిని కోటిగడపలెక్కి దిగుచుందువే నీకేలరా.... ఈ తీవి....

చీని చీనాంబర శాటీదుకూలవస్త్రధారివని యానీపొగరు.... అదియునుకాదే.... పేరాన నారగింప వరువెత్తిన గోమాయువు కొఱికి కొఱికి వినుగెత్తివిసర్జించిన గజచర్మంబునే కనకాంబరంబుగా భావించి, ధరించి సిగ్గుమాలి ముగ్గురిలో నేనొకమూర్తినని మురియు చుందువే....

దివ్యమణి గణస్థగిత సౌధోపరిభాగంబుల హాయిగొల్పు హంసతూలికాతల్పంబున శయనించువాడవనియా నీమిడిసిపాటు. అదియుకాదే! ఘోరానలదగ్ధమై చిటపెటార్భటులతో ప్రేలిపోవు కపాలశకలముల కాలవాలమౌ వల్లకాటిలో భయంకర కంకాళముల తలగడగానమర్చుకొని నిద్రించువాడవే....

వజ్రవైఢూర్య నీలగోమేధిక పుష్యరాగమరకత మాణిక్య ప్రభా భానమానతారహారంబుల ధరించు వాడనియా నీదురభిమానము.

నీమొగమున కంతమాత్రమా!....దుర్వారపరాక్రమోపేతపతంగనాథు కోపానల భీతచేతస్కుమలై, పరచివచ్చి వెనవెన బునలు గొట్టుచున్న పాపపేరుల మెడజట్టుకొని కూర్చుండ వాడవే....

భుజాంగద మణిబంధ ధగద్ధగాయమాన కటకతాటంక కంఠాభరణాదిసువర్ణ భూషణా లంకృతుడవనియా నీమిడిమేలము.

అదియుండిన నీవింకెట్లుందువో... తాళఫలప్రమాణ రుద్రాక్షమాలికల, గళంబున దోర్దండంబుల బలవంతంబున బంధించిన విధంబుగా ధరించి, ఘోరాపరాధియా వీధన చూపరులకీనడింపు గల్గించుచున్నావే...

నానావిధకుసుమ పరీమళ మిళిత శ్రీచందన లేపనాదికంబులంగల్గినమైమరుపా? అట్టిదియు కాదే.

వీతిహోత్రుని దేదీప్యమాన జ్వాలాపరంపరల కాహుతియైన ప్రేతంబుల అస్థిమాంసచర్మంబులు భస్మీభూతమైపోవ ఆబూదినెల్ల ప్రోవుచేసిబుంగలకెత్తుకొని, అహర్నిశలదేవనిగా మెయినెల్ల మెత్తుకొని బూడిదగుమ్మడివోలె వెలవెలబారి చూచువారి కనహ్యామగుచున్నావే....

రంభోర్వశీతిలోత్తమాదిదేవదాసీ జనంబులొనర్చు నృత్తగీత వాద్యనాట్యావలోకనానందసాగరోత్తుంగ తరంగంబుల నోలలాడువాడవనియా నీమిడిసిపాటు.... నీమొగమున కదియొక్కటియే తక్కువ....స్త్రీ శిశు బ్రాహ్మణ - భ్రూణహత్యాది ఘోరకృత్యంబులొనర్చి - జీవితానంతరమగణిత యమభటపాద తాడనంబుల ముక్కలుముక్కలైపోయిన ప్రక్కటెముకలు మూటగట్టుకొని పరువెత్తివచ్చిన - భూతప్రేతపిశాచాదిగణంబుల చేరబట్టి, వాని మధ్య నీవొక అపరమహేంద్రునివోలె అంటిపట్టికూర్చుండి, అవివేయుగంతులకు, చిందులకు నానందించువాడవే....

అనమాన వసురత్న శకలశలాకానిర్మితంబగు విమాన మదమాతంగ దివ్యతురంగంబులయానం బొనర్చువాడవనియా నీకావరము.... హాహా....నీబైసికింతమాత్రమా?....అనవరతము కర్షక కరావలంబనముగా నుండు ములుగోల పొడ్వుపులకు కుదుపులు గట్టిన తుంటి భాగమ్ములుగల దుక్కిటెద్దుపై వూరేగువాడవే....

ఆకతాయి! సర్వజ్ఞనామధేయుడవని విఱ్ఱవీగుచున్నావా? అదియు నీమెడవ్యర్థమగునే.... సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహ పంచకర్మాధికారప్రభుండైన పంచముఖునకు బానటయైన వాడవే.... అవివేకీ.... నీకేలరాయీగర్వాంధత... .ఇట్టివిచక్షణారహితుడవగుట చేతనే ఆవిరాట్పురుషుడు బ్రహ్మకు సృష్టికార్యంబును, విష్ణునకు స్థితికార్యంబును, దేవేంద్రునకు

తిరోధానకార్యంబును, భాస్కరునకనుగ్రహకార్యంబును నొసంగి, నీకుతగువైనదేయగు - తుడిచిముగ్గుపెట్టు- నిర్మూలన కార్యంబొసంగినాడు....

నిరంతరమట్టి నిర్మూలన కార్యంబున కలవాటుపడినవాడవగుటచేతనే.... విశ్వసించి చెంతజేరిన చెలికాని శిరంబుతెగనఱికి, గతిమాలి దానినే భిక్షాపాత్రగా చేతనుంచుకొని, అదియేనీఘనతకు చిహ్నంబనియెంచుకొనుచున్నావే....

వావివరుసలు - మంచి చెడ్డలు యోచింపక తల్లినే భార్యగా భావించిన పశుప్రాయుడవే. ఇట్టినీకిరాతహృదయంబున మాతాపితృగురుభక్తి, తాత్పర్యంబులకు లేశమేని తావుండునా, వినయ సంపత్తి కిసుమంతయేని వీలుండునా?

ఇట్టివాడవని ఎఱుంగకయే, భానమానసద్గుణాలంకృతయై, సురకాంతామణిమాలయందలి మేరువుగా విరాజిల్లు, నా ముద్దులపట్టిని అజ్ఞానియైన పాషండునకు నిర్దుష్టశ్రుతినొసంగినట్లొసంగి లేని అప్రతిష్ఠదెచ్చిపెట్టుకొంటిని. ఆనాడు పరమయోగ్యుడవని భ్రమసితిని. ఈనాటికి నీ యోగ్యతాయోగ్యతలు బయల్పడినవి.

ముమ్మూర్తులందు ప్రప్రథముడుగా బేర్కొనంబడు బ్రహ్మదేవునకనుంగుపుత్రుడనై., మరీచి భరద్వాజాంగీరసపులహపౌలస్త్యాది నవబ్రహ్మలలో నొకడనై, చతుర్దశమనువులందగ్రగణ్యుండైన స్వాయంభువమనువున కల్లుండనైన నాకు గరుడగంధర్వయక్షకిన్నెర సాధ్యవిద్యాధరాదిసురకులంబులెల్ల `సాష్టాంగపడుచుండ, నిర్భీతి నిర్లక్ష్యంబుగా నిరాకరించి, నాకంటే అధికుడవనిపించుకొన దలచి యున్నావా? ఎవరియాధిక్యత ఎట్టిదో చూచెదవుగాక....

చం|| *ఇదిమొదలైత్రిలోకముల నెందునుజన్నమొనర్పువారు నిన్*
*వదలిమహేంద్రుడాది సురవర్గమునేనుతియింత్రుగాక నీ*
*సదనమవజ్ఞమొందగ దిశాంపతులేద్గురకేహవిర్ఫలం*
*బొందవునుగాక భ్రష్టగతి నొందెదుగాక దిగంబరుండవై....*

(తెరదించబడును.)

---

ద్వితీయాంకము - 3 వ రంగము.

---

చండీ: పుష్పా! పుష్పా! ఆశ్రమంలో పిడుగులు పడుతున్నాయే.

ముండీ: పిడుగులు కాదే పుష్పా! ప్రళయమేవచ్చిందే!

పుష్ప: పరమేశ్వరుని ఆశ్రమానికి ప్రళయంరావడమేంటి? పిడుగులు పడడంయేంటి? మీకేమన్నా మతిపోయిందా యేంటి ?

చండీ: కాదే - కాదే — పుష్పా అష్టదిగ్గజాలు కూడ గడగడలాడిపోతున్నాయే.

ముండీ: అవునే - అవునే ఆదిశేషుడుతోకమీదనిలబడి బుసలుకొడుతున్నాడే.

పుష్ప: ఓరి! మీ అఘాయిత్యం పొడుగాను.... అసలు విషయం చెప్పండర్రా!

చండీ: ఒరేయ్ - ముండీ.... నువ్వు చెప్పరా.

ముండీ: చండీ - నువ్వుచెప్పరా.

పుష్ప: ఎవ్వరూ చెప్పక్కర్లేదు వెళ్ళండి....నాకు వేళైంది. నేను అమ్మగారికిపూలు కోసుకొని వెళ్ళాలి.

చండీ :
ముండీ: (ఇరువురు కలిసి) ఒసేయ్ - ఒసేయ్ - ఉండవే - ఉండవే మామాటకాస్త వినవే - ఇది దాక్షాయణీదేవిగారితో చెప్పవలసిన విషయమే. పుష్పా!

పుష్ప: అమ్మగారితో - మీరేవచ్చిచెప్పండి - నాకు వేళైంది.

చండీ : కాదే - కాదే మేముస్నానంచేసి ఆశ్రమసమీపానికి వచ్చామే.... వచ్చేసరికి....

ముండీ: లోపల ఎవ్వరో పరమేశ్వరుని దూషిస్తున్నారే....

చండీ: నోటబట్టరాని మాటలంటున్నారే....

పుష్ప: ఛీ....ఛీ....నోరుముయ్యండి....పరమేశ్వరుని దూషించువారు త్రిలోకాలలోనేలేరే! మీకేదో చిత్త విభ్రమకల్గినట్లుంది కాని, వైద్యుల పిలిపించివాతలు వేయిస్తాం. వుండండి.

చండీ: కాదే....నిజం చెప్తున్నామే.

ముండీ: అక్షరాలనిజమేనే....పుష్పా

పుష్ప: ఆ దూషించువారిని మీరు చూచారా?

చండీ: చూచాం - చూచాం. .

ముండీ: కాదు — కాదు విన్నాం -విన్నాం.

పుష్ప: అంటే - ఎవరైనా యీ విషయం అంటూంటే -విన్నారా!

చండీ: మేమే.... స్వయంగా -మాస్వంత చెవుల్తో విన్నామే.

ముండీ: అవునవునే....మేము పది అంగలదూరంలో వుండి విన్నామే.

చండీ: వీడిమొగం....వీడికి కొలతకూడా తెలుసూ....కాదు ముప్పై -ఇరవై -పదిహేను అంగలదూరంలో వుండి విన్నాం.

పుష్ప: మీకు సరిగా తెలియని విషయాన్ని యిలా అందరితో చెప్పి, లోకవ్యాప్తంచేస్తున్నారని, అమ్మగారితో చెప్పి మీ చర్మం ఊడదీయిస్తాను రండీ.

ముండి: ఒసేయ్ -పుష్పా కొంపముంచి అమ్మగారితో చెప్తావా యేంటి....

చండి: ఛ....ఛ.... మన పుష్పగదంట్రా ఎందుకు చెప్తుంది.

పుష్ప: అవునవును....మీపుష్పనేగాదు.... మీ బాబుగారి పుష్పనుగూడ.... అట్టైవాగారంటే.... చెంపవాచిపోతుంది జాగ్రత్త.

ముండి: పుష్పా! అలా అనకే -ముందు జన్మలో మనమంతా కలిసివున్నవాళ్ళమే.

పుష్ప: నీ మొగం - నీకు పూర్వజన్మ జ్ఞానం కూడా వుందీ!

చండి: ఉందీ.... ఉందీ.... అసలు నీకీవిషయం తెలిసినట్టిలేదే.

పుష్ప: నీకు తెలిపి - ఏడ్చింది లేవయ్యా!

చండి: అc....అc.... అలా అనకు....మాట మాట వరుసలో శంకరభగవానుడు దాక్షాయణీదేవి గారితో అంటూంటే వీడు స్వయంగావే విన్నాడట. నీవు పూర్వజన్మలో భోగంరంగసానివట - నేనేమో పురోహితానికి గూడా [illegible] తిరుగుతూవున్న శంకరశాస్త్రినట - పోతే....వీడేమో అప్పుడప్పుడూనాతో కలిసిగాని, వాడు సొంతంగాగాని, నీయింటికి వస్తూవున్న రామశాస్త్రియట. కాగా.... శివరాత్రి జాగారఫలితంగా మనముప్పురం శివసన్నిధానంలో శివభక్తులమై పుట్టామటనే పుష్పా!

పుష్ప: నిజమేనా! ముండీశ్వరా!

ముండి: మామాటమీద నీకు నమ్మకంలేకపోతె దాక్షాయణీ దేవి గార్ని అడిగితెలుసుకో.

చండి: ఈ విషయం తెలిసినప్పటినుండీ.... పూర్వజన్మ సంబంధం కాస్త కలుగజేసుకుందామని బుద్ధిపుడుతుందే.... పుష్పా....

ముండి: కాస్తా....కూస్తా....ఏంట్రా....గొప్పగానే....

పుష్పమ్మనీతోటి పొత్తుకుదిరిందంటె

పొన్నపూవులతోడి - పూజజేతు.

చండి: ముందు జన్మకు బోలి -పొందు జరిగిందంటె

మల్లెపూవులతోడి - మాలవేతు.

ముండి: వెధవ మల్లెపూలు మూచ్చూస్తే ముక్కులోకి పోతాయి.

బంతిపూవులతోడి - పడకవేతు.

చండి: ఓరీ - కుంకా! అంతకంటే పెద్దపూవులు లేవన్రా నీవుద్దేశ్యం.

పొద్దుపోదుపుపూల మిద్దెకదుదు.

ముండి: పాదములు రెండు గట్టిగా - పట్టుకొందు.

చండి: పిక్కలను బట్టినెత్తిపై - పెట్టుకొందు.

ముండీ: మూడుపూటలు వరుసగా - మొక్కుకొందు.

చండి: ఐదుసారులు కన్నులకద్దుకొందు.

ముండి: పుష్పా.... వీడిమొగం....వీడునూ.

చండీ: వీడి శ్రాద్ధం.... వీడునూ.

దండకం

ముండి: పుష్పానాకున్నయావత్తు నీకే సమర్పింతు, నీకున్న నావంతుగానెంతు - నీకొంగునే బట్టి నీతోడనేవత్తు - నీకూడ నీముందునేనిల్తు- నీప్రక్కనేనిల్తు - నిన్నుప్రేమించెదన్ కామించెదన్ నిన్నుసేవించెదన్ నిన్నుపూజించెదన్ - నిన్ను వర్తి - నిన్నురంజించెదన్ నిన్నునాదేవిగా - నిన్నునారాణి నాదుప్రాణమ్ముగా - ప్రాణదైవమ్ముగా -దైవరూప రూపశిల్పంబుగా - శిల్పచిత్రంబుగా - మదిన్నెంచద దయంజూడుమమ్మా - నమస్తే - నమస్తే - నీలవేణి నమస్తే-

చండి: ఒరేయ్.... ప్రార్థన సమయంలో కండ్లు తెరుస్తార్రా యెవరైనా దద్దమ్మా.... (ముండి కళ్ళుమూసుకొనును.)

దండకం

చండి: (కళ్ళుమూసుకొని) పుష్పా! నీమాటపాటించి -నీపాట నీబంటుగానుండి -నీయింటనే యుండి వంటనేజేసెదన్

బిందెనేతెచ్చెదన్ - బట్టలన్ పుతికెదన్ - నీమంచముల్‌వాల్చి నీమంచమున్నెత్తి - నీపక్కలన్ వేసి - నీపక్కలన్‌చుట్టి భక్తి సేవించెదన్ - బట్టలన్ పుతికెదన్ - నీకాయతో తోమి స్నానంబు చేయించి - చీరనేగట్టెదన్ - రవికనేతొడిగెదన్ వీడెంతమూర్ఖుండు నన్నేదయంజూడుమమ్మా .... దాసాన దానుండ - నమస్తే....నమస్తే....నమః

## ద్వితీయాంకము - ( 4 రంగము)

నారదుడు: (తెరముందువైపునకు ప్రవేశించి) (స్వగతము) ప్రస్తుతము మహాదేవునకును అతని మామయగు దక్షునకును ఘోరవైరము సంఘటిల్లియున్నది. పరమేశ్వరుని నిందించి బాగుపడినవాడును, సరస్వతిని సేవించి చెడిపోయిన వాడును ముల్లోకముల లేడని పెద్దలనుచుందురు....అనుభవమువ గూడ అట్లే జరుగుచున్నది. అహంకారపూరితుడైన ఈ దక్షప్రజాపతి ఈ శావ్యాధిపతినుజ్జగించి బృహస్పత్యాగమొనర్చుచున్నాడు. ఆదిశంకరుడా విషయంబువెరింగియే దక్షాధ్వరంబునకు పోవొల్లకున్నాడు. ఈ విషయము నెఱింగినవారగుటచేతనే బ్రహ్మ విష్ణువులు తటస్థముగానున్నారు.

ఇప్పట్టున దాక్షాయణీదేవికి నానేర్పుకొలంది యుత్సాహంబురేకెత్తించి, తన తండ్రిచేయుయాగంబునకు ప్రయాణంబు గట్టించెద. దాక్షాయణీదేవీ ప్రయాణమునకు పరమేశ్వరుడు సమ్మతించునా? సమ్మతింపడు. పుట్టింటి ప్రయాణమగుటచే దాక్షాయణి మాత్రము తన పట్టుదల వీడునా? వీడదు.... ఇక్కడనేయున్నది. రసవత్తరఘట్టము. ప్రస్తుతకర్తవ్యము దాక్షాయణీదేవిని సందర్శించుటయే.

(రజితాచలమును గాంచినట్లు నటన)

గీ|| *అదిగో రాజితరాజతాద్రి శిఖరంబందందు తారాడు న*
*య్యదియేనంది యదే త్రిశూలమవె భూతానీకశయ్యాస్థలుల్*
*రుదురాకల్ధరియించు శంభుదతదేరుద్రాణి సంసేవ్య న*
*త్పదరాజీవరజోవివర్ధిత పవిత్రక్ష్మాతలంబయ్యదే.*

(స్టేజీలోపల ప్రవేశించును) తెరపత్తబడును.

( దాక్షాయణీదేవి మందిరము - రెండు కుర్చీలు వేసియుందును )

నార: జగదేకపావనీ!....శుభంబగుగాక!

దాక్షా: (చెలికత్తెతోడి లేచి) ఓహో! నారదమునీంద్రులా! దయచేయుము -దయచేయుము.

చెలీ! లోనికివెళ్ళి ఫలపుష్పములు గొనిరమ్ము.

చెలీ: అట్లే తల్లీ! (చెలికత్తెలోనికి వెళ్ళును)

దాక్షా: ఎల్లరకు క్షేమమే నారదా....

చెలి: ( పండ్లుపూలు గొనివచ్చి చెలికత్తె దాక్షాయణీ కందించును )

దాక్షా: (నారదునకు సమర్పించుచు) నారదా నేడుమిమ్ముగాంచుటతో నామనంబెంతయో సంతసిల్లుచున్నది. ఇంతకాలము మీదర్శన భాగ్యములభింపనందుకు కారణమడుగవచ్చునా?

నార: తల్లీ! భగవానుడు నాకు నిర్ణయించిన పని త్రిలోకసంచారము. ఒక్కొక్కపుడు, ఒక్కొక్కలోకమున కొన్ని సమస్యలుత్పన్నములగుచుండును. అట్టి తరి ఆయా సమస్యా పరిష్కారార్థమై. అచ్చట కొంతకాలముండవలసివచ్చును. అదికారణముగా, ఈ మధ్య మీదర్శనం బొనర్పకొంతయాలస్యమైనది. అంతియేగాక ఈ మూడు లోకంబులందెచ్చటనే విశేషము జరిగినను అప్పటికపుడే నాకవగతమగును. జేరిన వార్తలను నిలువ యుంచక వెంటనే ఎవరికి సంబంధించినవి వారికి తెలియజేయుచుండును,.

చెలి: మునీంద్రా! ప్రస్తుతము మాకు సంబంధించిన విషయమేదోగొనివచ్చినారన్నమాట.

నార: ఆహా! ఏమి నీనేర్పు పుష్పా! నేచెప్పబోవు విషయమేదియైనదిగూడ చెప్పగల సమర్థురాలవుగానున్నావే భేష్....

దాక్షా: మునీంద్రా! మావారెల్లరకు క్షేమమేనా?

గీ|| *నాదుజననియు జనకుండు ! నాయనుంగు*
*సోదరీమణులెల్లర చొప్పట నూత్న*
*శోభలందేలుచుండిరె సుఖులరగుచు*
*మాదు సేమంబులడిగిరే మౌనివర్య.*

నార: మీవారి క్షేమమునకేమమ్మా....దాక్షాయణీ.... అక్షయము. నవబ్రహ్మలలో నొకడైన మీతండ్రి దక్షప్రజాపతి ఎట్టి విభవసంపన్నుడుకానిదే అంతటి బృహస్పత్యాగమును దలపెట్టి మున్నెన్నడుకని,విని, యెఱుంగని రీతిలో జరుపనేర్చునా?

దాక్షా: మునీంద్రా! బృహస్పత్యాగమా? మాతండ్రిగారాచేయునది?

నార: అవునమ్మా! మీతండ్రిగారే.... దక్షప్రజాపతి

చెలి: మునీంద్రా! ఎపుడు ప్రారంభించియుండిరి.?

నార: ఆఁ.... నిన్నమొన్నటినుండియే.... నీకును ప్రయాణమున్నదిగా. దాక్షాయణీదేవి గారితో వెళ్ళి సర్వ విధములగుకానుకలు దెచ్చుకొను సమయముగదా....అందుకేనీవును ఉబలాటపడుచున్నావు.

దాక్షా: మునీంద్రా! యజ్ఞము పూర్తికాకముందే మీరుతిరిగివచ్చుటకు కారణమడుగవచ్చునా?

నార: దాక్షాయణీ! నేను విష్ణుదేవుని పనుపునవేరొక కార్యార్థమై మీతండ్రిగారి పట్టణ ప్రాంతమునకు వెళ్ళి యుంటిని. ఆపని పూర్తిగావించుకొని తిరిగి వచ్చుటలో మార్గమధ్యమున మీతండ్రిగారొనర్చుయజ్ఞమునకు వెళ్ళు బ్రాహ్మణులు కలిసికొనిరి. వారు చెప్పుమాటలంబట్టి ఆ యజ్ఞవైభవము తప్పక చూడవలెననియే కుతూహలము గల్గినది. అదియునుగాక యజ్ఞము జరుగుచున్నదన్నవార్త విన్నవాడు దానిని దర్శింపక త్రోసిపుచ్చినచో ఘోరనరకమనుభవించుననియు, క్షణమాత్రమైనను తిలకించినచో మరుజన్మమున అగర్భశ్రీమంతుడగుననియు పెద్దలు చెప్పుచుండవిన్నవాడనగుటచే, అటుపోయి సర్వవినోదములను విహంగవీక్షణమొనర్చి... .వెంటనే మరలివచ్చుచున్నాడ.... మరి....మీరును కుటుంబసమేతముగనే వెళ్ళదలచియున్నారా?

దాక్షా: లేదునారదా....మాకా విషయమే తెలియదే!

నార: అదేమిటి తల్లీ! పెద్దల్లుడూ, పెద్దకూతురు, మిమ్ముల పిలువకనే మీనాన్నగారు యజ్ఞము చేయుచున్నారా?

దాక్షా: నిజము నారదా! మీతో పరిహాసమాడుదునా?

నార: ఓహో! స్ఫురించినది. ఆ యజ్ఞము దాదాపొక మాసము రోజులు జరుగుచుండును. ముఖ్య బంధువులందఱును పూర్ణాహుతులరోజులందే వచ్చుచుందురు. మీకును....నేడో, రేపో పిలుపు రాగలదు తల్లీ.!

దాక్షా: మునీంద్రా! మాకెప్పుడు పిలుపువచ్చునో ఎప్పుడు వెళ్ళుదుమో. అచ్చటి విశేషము లెల్లను మీనోట వినవలెనని కుతూహలమగుచున్నది. శ్రమయనుకొనక వివరింపుము. మునీంద్రా!

నార: విశేషములా....హా....హా....హా ఏమి చెప్పనమ్మా . నేనేకాదు. నాతండ్రియగు బ్రహ్మదేవుడు కూడా సంపూర్ణముగవర్ణింపజాలడు తల్లీ!

ఉ॥ వచ్చులతోరణాలు పొలుపారెడు మౌక్తికరంగవల్లికల్
మెచ్చుగుచల్వపందిరులుమేలిమిరత్న విశేషకాంతులా
యచ్చుపువైదికస్వరములాటలు పాటలు వేల్పుదంపతుల్
వచ్చుచుపోవువైఖరులు వర్ణన జేయగనాతరంబొకో.

అంతియేకాదు తల్లీ!

ఉ॥ అచ్చటి రత్నకంబళములచ్చటి బంగరు పీఠికాచయం
బచ్చటి పట్టుపాన్పులు మహాద్భుతదీపికలింతకేనుము
న్నెచ్చట చూడలేదవిమజాన్నడు చూడగబోము బావురే
ముచ్చటగొల్పెనాకనులు మూతపడెన్ జగదేకమానినీ.

దాక్షా: మునీంద్రా! ఇంతటి వైభవోపేతముగా సవనమొనర్చుచు మాతండ్రి ముందుగ మమ్ముల బిలువకపోవుటకు కారణమేమైయుండునో.

నార: ఏల పిలువకుండనమ్మా! రేపో, మాపో మీకును పిలుపు రాగలదు.

దాక్షా: మునీంద్రా! యాగనిర్వహణార్థమై రావలసిన సురవరులెల్లరు విచ్చేసియుండిరా?

నార: ఒక్కసురలేమిటి తల్లీ!

కం॥ సురయక్షసిద్ధకిన్నర
గరుడులు విద్యాధరేంద్రు! గంధర్వులు భూ
సురవరనరవరులును ఖే
చరులుగ భూచరులుగాగ! చనుదెంచిరహో!

ఆహా! హా! హా! ఏమి మర్యాదలు, ఏమి మర్యాదలు తల్లీ! ఆయేర్పాటులన్నియు దక్షప్రజాపతి ఎవరియాధిపత్యమున జరిపించుచున్నారోగాని, వర్ణనాతీతమమ్మా.

ఉ॥ కాళ్ళకునీళ్ళు లిచ్చి కడకమ్మనిశీధువు లిచ్చువారలె
న్నాళ్ళకు దర్శనంబనిఘనంబుగస్వాగతమిచ్చువారు వం
దిళ్ళ సుఖాననమ్ములయతీంద్రుల బూజలొనర్పజాళువా
బళ్ళెము దెచ్చువారు ప్రియభావమునందిలకించువారలున్.

దాక్షా: అయితే మునీంద్రా! మాసోదరీమణులెల్లరును కుటుంబసమేతముగనే విచ్చేసియున్నారా? వారునన్నుగుఱించియేమైనా ప్రస్తావించిరా?

నార: కనిపించిన వారందఱితోను మాట్లాడినట్టే....కాని మీ అప్పచెల్లెంద్రలో ఒకరిద్దఱు మాత్రమే కన్పించినట్లు జ్ఞాపకం తల్లీ!

దాక్షా: మునీంద్రా! మా నాన్నగారు నా విషయమేవియు ప్రస్తావించలేదా?

నారః అయ్యో! పిచ్చితల్లీ! ఇంతకు నేనచ్చట ఇంచుకసేపైనను ఆగినగదా... మాట... మందలింపు.... పైగా మీ జననీజనకులు దీక్షాకంకణబద్ధులై హోమము జేయుచుండిరి. అట్టివారితో సంభాషించుటకు వీలు కలుగునా తల్లీ!

చెలి: మౌనీంద్రా! దక్షాధ్వర విశేషములు మీనోటవినిన కొలది మాకన్నులకు గట్టిగట్లున్నవి. ఇంకనూ ఏవేని విశేషము....లున్నట్లయితే....

నారః తల్లి దాక్షాయణీ!

ఉ॥ *ఏమనిచెప్పవాడ నికనెమ్మెయి వర్ణన సేయువాడ నిం*
*దేమివచించినన్ దనివియించుకదీరునె యట్టి వేడుకల్*
*నీమనసారనేగి గమనించిన తృప్తి జనించుగాని నీ*
*వేమి పరాయిదానవగుదే యటకేగగ సంశయింపగన్.*

దాక్షా: (ఏదో ఆలోచనలనుండి తేరుకొని) సంశయించుటకాదు మునీంద్రా!

గీ॥ *పిలువవచ్చునా మాతండ్రి! పిలువరాడొ*
*అట్టితరినేనుపోయెద! నను మశంభు*
*నడుగబోయిన నన్నుపొ ! మ్మనునులేదొ*
*అనెడు సంచియమొక్కటే, యతివరేణ్య!*

నారః ఎంత పిచ్చిదానవమ్మా ! దాక్షాయణీ!

గీ॥ *పుట్టినింటను జరుగు నపూర్వమైన*
*సవనకార్యంబు వీక్షింప! చనకయుట్టు*
*లెవ్వరేనియునుందురే! ఇంతతడవు*
*మీనమేషంబు లెంచుచు! మీన నేత్రి.*

చెలి: మునీంద్రా! మీరు చెప్పినదియు నిజమే.... కాని దక్షప్రజాప పిలువకపోయినచో దాక్షాయణీ దేవి ప్రయాణమునకు పరమేశ్వరు నమ్మతించునా.

నారః (చెలికత్తె వైపుజూచి) - అమ్మాయి

(దాక్షాయణి వైపు జూచి ) తల్లి దాక్షాయణీ ! జరుగు చుండు పెండ్లికార్యముగాదు. పిలుపురాలేదని ప్రయాణమాపుకొనుట అదిసర్వకామ్యార్థ సిద్ధికై, చేయు సవనకార్యము.

అట్టిమహత్త ...యాగమున దర్శించి యెల్లవారును తరించు చుండ ఆడుబిడ్డవు నీ పిలుపెందుకమ్మా. ఆ ధర్మము మహాదేవునకు మాత్రం తెలియదనుకొంటివా?

ఉ॥ *పోవుట చూచి వచ్చుటొకపుణ్యవిశేషము శంభురాణి, వా*
*పోవుచు కూరుచుండిన యపూర్వ ఫలంబుగ నొక్కసారి, యే*
*తావున చూడగల్గుదువు దగ్గరి బంధుల తల్లిదండ్రులన్*
*బావలనత్తమామలను భవ్యచరిత్రుల వేల్పులందఱిన్.*

దాక్షా: నారదమునీంద్రా! మీరు చెప్పినదంతయు సత్యబద్ధమే. కానీ,....ఏలకో నామనంబు వెనుకంజవేయుచున్నది.

నార: సరి.... ఇకపోయినట్లే.... ఈముందు వెనుకంజలతోనే సవనకార్యము సమాప్తము కావచ్చు.

దాక్షా: అయితే మునీంద్రా! పరమేశ్వరుని కడకేగి నా ప్రయాణ ప్రస్తావన చేయమందురా?

నార: అయ్యో, ఎంతబేలవమ్మా దాక్షాయణీ! ప్రస్తావన చేయమందువాయని....ఇంకనూ ప్రశ్నించుచున్నావే....మరి నిశ్చయమెన్నటికో.

దాక్షా: కాదు మునీంద్రా! నిశ్చయించుకొనియే మిమ్మడుగుచున్నాను.

నార: ఒక్క నిశ్చయమేమిటి తల్లీ! నిశ్చయము, నిశ్చయము నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము. అధవా నిశ్చయించుకొనవు.... పోయిచూడవు.... .తదుపరి....

ఉ॥ ఇట్టి మహోత్సవకాశమదియెప్పుడుగల్గు సతీమతల్లి నీ
వెట్టులనైన శంభుకడకేగియనుజ్ఞనుబొందిరమ్ము, నే
నిట్టులెవచ్చువాడమది నేటికి సందియమందె దమ్మ ఇ
ప్పట్టున జూడకున్న నికప్రాప్తము లేదని నిశ్చయింపుమా!
అమ్మా! దాక్షాయణీ! ఇకపోయివచ్చెదను....సెలవా?

చెలి: మునీంద్రా! మీరును వచ్చెదనంటిరే!

నార: అవును.... మీ మార్గమున మీరు రండు. నేను మిమ్ముకలిసికొందును. మీరునాకై వేచియుండనవసరములేదు.... అమ్మా దాక్షాయణీ! సెలవు.

( పాట పాడుచు వెళ్లును. తెరదించబడును )

## తృతీయాంకము - 1 వ రంగము

( శంకరుడు యోగ నిష్టలో యుండును. )

నార : (పాటపాడుకుంటూ ప్రవేశించును) (స్వగతము) ఆదిదేవుడ నితరసాధారణ సమాధియందువవిష్టుడైయున్నాడు. ప్రార్థించి పలుకరించెద.

(ప్రకాశముగా) మహాదేవా! సమాధియందువవిష్టుడవై, అనిర్వచనీయానంద పారావార తరంగ డోలికలతేలియాడుచున్నావే! మహానుభావా! మూఢాత్ములు నీతత్వంబు నెఱుంగజాలక నీవును తమవలెకామక్రోధాది గుణంబులకధీనుడవనియే భావించి, పశుప్రాయులై, నిందించుచున్నారే. అట్టివారి దుర్గతి నీకు తెలియనిదికాదు. అయినను నావిధినేను నిర్వర్తింవకతప్పదు కదా..... స్వామీ.

ఉ|| *దేవదయాంబురాశి జగదేకవిభూ ! శివదేవదేవనీ*
*భావమెఱుంగజాలని యభాగ్యులకెందువిముక్తి యున్న దే*
*ఈవు నహాయమైదరియ, నేరికి నైనను భోగభాగ్య నం*
*భావనకేమిలోటుగనువట్టుదు దివ్యము నీంద్రసేవితా!*

ఈశ్వ: ( యోగనిష్టనుండిలేచి ) ఓహో! నారదా! నీవా ! సంశయింతువేల ? రమ్ము.

నార : ఆహా ! కోటి సూర్యప్రభాభానమాన పరమేశ్వర చిద్విలానమెన్నాళ్ళకు చూడగలిగితిని.

ఈశ్వ : త్రిలోక నంచారీ!

ఉ|| *నారదమౌని! నీదుగమనంబెటనుండి యనామయంబె నం*
*చారవిశేషముల్ గలవె నజ్జనులెల్లరు నెల్లచోట్ల వి*
*స్తార నుఖమ్ముమై మనగజాలిరె, దుండగులెక్కడేని, ధి*
*క్కారము సేయుచుండి రెయకారణమై రమునుత్సహించుచున్.*

నార : పరమేశ్వరా! త్రిజగత్కల్యాణ నందాయకుడవగు నీవయెరుంగని విశేషములు త్రిలోకనంచారినైనంతమాత్రమున నాకవగతమగునా! దేవ దేవ!

ఉ|| *నీవు మహా నుభావుడవు నీవు గ్రహించవనిదెద్ది యేని యే*
*తావున లేదు మాంద్యమున దక్షుడొనర్చు మహాధ్వరంబునీ*
*కేవివరంబుగా తెలియునివ్వుడునేనొనరించునట్టి ప్ర*
*స్తావనయేగణించకు సదాశివనావిధినేనొర్చెదన్.*

ఈశ్వ : పరమయోగీంద్రా ! నారదమునీంద్రా! దక్షాధ్వర విశేషంబులా నీవుచెప్పబోవునది.

నార : అవును పరమేశ్వరా ! అతిముఖ్యమైనవి. ఆలించ వలసినవికూడా.

ఈశ్వ: ఏమీ ! అంతముఖ్యమైనవా ! అయినచో వివరింపుము.

నార : వివరింపుమందురా..... చెప్పుటకు నాకేసిగ్గగుచున్నది స్వామీ ! అయిననుదాచకూడని విషయము కనుక చెప్పక తప్పదు. కొండతో తగరు ఢీకొన్న పోలిక దక్షప్రజాపతినీతో వైరము పెంచుకోదలచి, సప్తదిక్పాలురప్రతిరూపంబులను మాత్రమే యజ్ఞ వాటికయందుంచి ఈశాన్యాధిపతులైన మిమ్ముల ద్రోసివుచ్చి యజ్ఞమొనర్చుచున్నాడు.

ఈశ్వ : ఆయాగవిలోకనార్థమై, దక్షప్రజాపతి బంధుమిత్రులెల్లరు విచ్చేసియుండిరా?

నార : ఒక్కబంధుమిత్రులేమిటి మహాదేవా! కవిపండితగాయక నటవర్గముతో సహావిచ్చేసియున్నారు.

సీ|| *ఒకచోట భూసుర| నికరంబువేదాల*
*సరణి దప్పక చక్క | జదువుచుండ*
*ఒకచోట దక్షుని| సకల బంధుశ్రేణి*
*యాగవైశిష్ట్యంబు| సరయుచుండ*
*ఒకచోట గాయకుల్| ప్రకటవాద్యములతో*
*తమిదీరసూత్న గీ| తములు బాడ*
*ఒకచోటకామినీ| ప్రకర విన్యాసంబు*
*మధుర మంజులరీతి| మలయుచుండ*

గీ|| *ఒకటసురలును వేరవే| రొకటనరులు*
*వారి దారసుతాదుల| వ్వారిహితులు*
*భూమిదేవతలొకటవి| భూతిమెఱయ*
*వరుసకూర్చుండిరా సభా| భవనమందు.*

అన్నియునొకయెత్తు అగస్త్యుండొకయెత్తన్నట్లు పరమేశ్వరా చెప్పవలెకోదగ్గది ఒక్కటిమాత్రమే గలదు.

ఈశ్వ : అంతమహత్తరమైన దేమిటినారదా !

నార : అదేవిచిత్రమైనది - విరుద్ధమైనదిగూడ దేవా !

ఉ|| *పోయితిచూచివచ్చితినపూర్వముగా శివమూర్తి లేక వా*
*పోయిన యజ్ఞశాల మిముబోంట్లు వరాభవమంద దక్షుడ*
*ట్లేయొనరించుచో విబుధులే తగుశాస్త్రి యొనర్తురంచునే*
*పోయిన దారినే పరువుబోయిన వాని విధాన వచ్చితిన్||*

ఈశ్వ : పరువుబోయిన వాని తెరంగుననా?

నార : అవును మహాదేవా ! కేవలము పరువుబోయిన వాని తెరంగుననేకాదు - తరిమికొట్టబడిన వాని తెరంగునకూడ... మహా దేవా !

ఈశ్వ : నారదా ! ఒకవేళ దక్షుడు ఈశాన్యాధిపతిని త్రోసివేసి నంతమాత్రమున ఎల్లలోకములవారును అట్లే చేయుదురా ? ఇంతమాత్రమున మనకేమిన్యూనత నంభవించినది?

నార : మహాదేవా ! ఈ విషయమునంత స్వల్పముగ భావింపకుడు.

చం|| *అయిననుగాక పోయినను, నాతనియల్లుడవన్న గౌరవం*
*బయినను లేకదక్షుడు నిరాదర దృష్టిని జూచె మిమ్మెవం*
*దయిన నొనర్చెనే యిటులనక్కట లోకమెఱింగి నంతలో*
*నయమొ భయమ్మొ వానిదగు నాల్కనడంపకయుంట*
*భావ్యమే.*

లోకాలోకములకధినాధుడవైన మహేశ్వరునింతటి హేయభావమున జూచుటయా! ఆదిదేవుడవై, ఒకవేళ నీవు నహించినను, నీభక్తులమైన మేము మాత్రము నహించలేము మహాదేవా!

ఈశ్వ: నారదా! ఆవిషయమటునుండనిమ్ము... దక్షునాహ్వానమును బొంది, బ్రహ్మవిష్ణులు గూడ వచ్చి యున్నారా!

నార: మహాదేవా! అడుగమరచితిని. దక్షప్రజాపతి మిమ్ముల నా హ్వానింపలేదా.

ఈశ్వ: ఇప్పుడు నీవేవినిపించితివిగదా... మరి.... అంతటి విరోధ భావము నాపై బూనిన దక్ష ప్రజాపతి నన్నేల పిలుచునయ్యా!

నార: మరి.... విరించి విష్ణులు మాత్రమంతపిచ్చి వారలా మహాదేవా! మీకైన యవమానము వారికైనట్లుగాదా? అందువల్లనే వారెవ్వరును వచ్చియుండలేదు.

ఈశ్వ: అర్థమైనది.... మొన్నటి సత్రయాగంబున దక్షుడొనర్చిన ప్రతిజ్ఞ ఈనాడు రూపుదాల్చినదన్నమాట. కానిమ్ము దీని పర్యవసానమేమికాగలదో పరికింతము.

నార: పరమేశ్వరా! మఱియొక చిన్న విషయము. సతీదేవి దక్షయాగము సందర్శింపనేగదలచినట్లు కర్ణాకర్ణికగా వినియుంటిని. ఈ సమయమున నామె ప్రయాణమును వారించుట సర్వవిధముల శ్రేయస్కరము. ఈ విషయమును నేనే యామెతో చెప్పదలచితిని. కాని, విషయము మీకర్థమైయున్నచో బాగుండునని, మీతో నే నివేదించుకొంటిని. ఇక నాకు సెలవా? ..... పరమేశ్వరా!

ఈశ్వ: మంచిది నారదా!

నార: (మరల తిరిగి జూచి) పిలువని పేరంటమునకు సతీదేవి నంపుదురేమో.

ఈశ్వ: ఆమె మాత్రమెట్లు పోదలచునారదా!

నార: (పాట పాడుకొనుచు వెళ్ళిపోవును)

దాక్షా: (మేలిమునుగుతో ప్రవేశించును)

ఈశ్వ: (ఏదియో ఆలోచనలో నుండి తేరుకొని దాక్షాయణి వైపు చూచును.)

దాక్షా: పరమేశ్వరునకు పాదదాసి నమస్కృతులు.

ఈశ్వ: దాక్షాయణీ! ప్రవేశింపుము.

దాక్షా: (ఈశ్వరుని చెంతకూర్చుని.)

ఉ|| *శ్రీకరవిద్రుమలాన సురసేవితదివ్య పదారవింద శం*
*ఖాకరిచర్మచేల పణిభూషణ చంద్ర కళాధరా! మహే*
*శా! కణ కంఠ! ధూర్జటీ! వృషధ్వజ! భర్గ! పినాకపాణీ! దే*
*వా! కమనీయ సుందరశివా! త్రిపురాంతక! నీకుమ్రొక్కెదన్.*

(అని పాడుచు శంకరుని పాదములు కన్నులకద్దుకొనును.)

ఈశ్వ: దాక్షాయణీ! నీరాకకు కారణమేమి?

దాక్షా: నాథా! ఈనాడొక కోర్కెచే ప్రేరేపింపబడి, నిగ్రహశక్తి చాలమి దానికధీనురాలనై, మీయొద్ద కేతెంచితిని.

ఈశ్వ: సతీ! సకల సద్గుణాలంకృతవైన యువతీ ! మన్నింపదగిన కోర్కెయెద్దియైనను, మాటయిచ్చుట కభ్యంతరమేముండును.

దాక్షా: అట్లయిననేననుగ్రహీతను పరమేశ్వరా!

ఈశ్వ: దాక్షాయణీ! నీకోరిక నాకెఱిగింపకయే, నేను అనుగ్రహింపకయే, అనుగ్రహీతనని సంతసించుచున్నావే! ఎంత అమాయకురాలవు. ఆకోరికయునిట్టిదియే యైయుండునా?

దాక్షా: హృదయేశ్వరా! చరాచరభూత జాలంబులకాధారభూతుడవై, చతుర్ద శభువనంబులలీలా వినోదంబుగా పరిపాలించు సమర్థుడవు, సర్వజ్ఞుడవు. మఱినీవు యెరుంగని రహస్యముండునా చంద్రశేఖరా!

ఈశ్వ: దక్షపుత్రీ! ఇంతకును.... నీమనోరథంబెరింగింపకయే.

దాక్షా : నీలకంధరా! మీయెడకేతెంచినది విన్నవించుకొనుటకేగదా మఱి..... యేలదాచుకొందును.

ఉ|| *దేవమహర్షి నారదుడిదే యిటువచ్చివచించె వైభవ*
*శ్రీవిలసిల్లు నాజనకుజేసెడి యాగము గూర్చి యెంతయో*
*ఈవును సమ్మతింపమన మిర్వురమేగి ప్రశస్త వస్తునం*
*భావనలెల్లనందికొనివత్తము చిత్తముల్లసిల్లగన్.*

ఈశ్వ: ఓహో! గజకర్ణ, గోకర్ణాది సమస్త విద్యాపారంగతుండైన నారదుండు నీకడకును ఏతెంచి నాడన్నమాట.

దాక్షా: ఘాలలోచనా!

చం|| *సురలరుదెంచినారలట, సొంపుదలిర్ప సతీసమేతులై*
*కరమరుదైన రీతిని నఖండకళాకమనీయశోభలన్*
*జరుగువినూత్న యజ్ఞమట సంయమి సంస్తవనీయమంటనే*
*నరుగకపోయినన్ జనకుడాగ్రహమొందును తల్లికుందెడున్.*

ఈశ్వ: అవును దాక్షాయణీ! యదార్థమే వచించితివి. "నొనటి వ్రాతనోట బలుకునన్నట్లు " నీవచటకు వెళ్ళినచో... జనకుడాగ్రహమొందును. తల్లికుందును... ముమ్మాటికీ ఇదియే జరుగబోవునది.

దాక్షా: (చెవులుమూసికొని) అమంగళము ప్రతిహతమగుగాక! పరమేశ్వరా.... నేనమంగళము బల్కితినా? ఎంతపొరబాటు.

ఈశ్వ: నీవు పొరబాటుపడలేదు దాక్షాయణీ! ఉన్నదున్నట్లుగనే పల్కితివి. మనస్సునకు - మనస్సే సాక్షి.

దాక్షా: పరమేశ్వరా! ఇంతకు, నాకోర్కెను మన్నింపవీలుకాదనియేగదా మీసమాధానము. (అనుచు మొగమావలికి త్రిప్పుకొనును).

ఈశ్వ: ఏమది? ఇంతలోనే విముఖతయా? సరే! దాక్షాయణీ నీజనకుడొనర్చుయాగమునకు వచ్చిన వారెల్లరును

నీ తండ్రిచేనాహ్వానింపబడియే వచ్చియుందురు. నీకును అట్టిఆహ్వానమేదైన గలదా.

దాక్షా: లేదు... నాధా!

ఈశ్వ: మరీ... నాకునులేదు.

చం|| *పిలువని పేరటంబునకు పేర్మితనంతట తానెపూని పో*
*దలచుటభావ్యమౌనె విదితంబగు నిద్దియెఱుంగకుంటివే*
*శిలభమనోజ్ఞాగామిని సుఖాస్పదమైన వియెన్ని యేనికో*
*ర్కెలనలరింతుగాని యటు గోరకయిట్టిది కోరుటొప్పునే.*

దాక్షా: హృదయేశ్వరా! పితృగేహంబునకు, మిత్రుని మందిరమునకును గురునిలయంబునకును, భర్తృనివాసంబునకును, పిలువకయే పోవచ్చునని పెద్దలు చెప్పగా వినియుంటిని. అదియు మీరెరుంగనిది కాదే!

ఈశ్వ: సతీ! నీమాటలు నిజమేకావచ్చు. అధర్మము నీతండ్రివంటి విచక్షణా రహితుని యెడల పనికిరాదు. సాధుశీలము, వినయ సంపత్తి, ఔదార్యము, సమతాభావము, ఎవని హృదయమున చోటుజేసికొనునో, అట్టివాడే బంధుమిత్రాదులరాకను పదివేలుగా భావించును. ఆదరాభిమానములతో సత్కరించును.

దాక్షా: నాధా! ఏమిటీ అవాచ్యము. నాతండ్రివిచక్షణా రహితుడా! వినయసంపత్తిలేని వివేకహీనుడా! ఎంతమాటంటిరి. ఇంతకూ నాతల్లిగారింట నాకు మర్యాద జరుగదనియేగదా మీరు చెప్పునది. నేనంతటి దుష్కార్యమేదేని యొనర్చియున్నచో మీరే శిక్షింపగూడదా? ఒకవేళ మాతల్లిగారింటికి నన్నంపుటకు మీకిష్టములేకపోయినచో పోవచ్చునుగానీ, ఈవిధముగా ములుకులంబోలు పలుకులతో నాహృదయమును బాధించుట భావ్యమగునా? పరమేశ్వరా!

ఈశ్వ: దాక్షాయణీ! నామాటలు నీవపార్థము జేసికొనుచున్నావు. నీయెడలదోషమాపాదింపజేసి నేననుటలేదు. నీ తండ్రియొక్క కుటిలవర్తన మేనేననుటకుకారణము.

గీ|| *వరకులంబును విత్తంబు / వయసుతపసు*
*రూపమున్ విద్యజడునిదు / ర్గుణుని జేయు*
*నవియె యుత్తము జేరిన / యద్వితీయ*
*సాధుశీలత కీర్తియు / సంగుచుండు.*

దాక్షాయణీ ! పై సంపదలలో కొన్ని మీతండ్రిని వరించి యున్నవి. ఆ సంపద్గర్వంబుననే నాతడు హరిహరబ్రహ్మాదులనేని లెక్కింపక ఛీంకరించుచున్నాడు. ఆతడు చేయు బృహస్పత్యాగమునకు నన్ను త్రోసిపుచ్చి సప్తదిక్పాలురను మాత్రమే ఆహ్వానించియున్నాడు. అట్లా తనిచే బహిష్కరింపబడిన నేను ఆ యజ్ఞ సందర్శనార్థమై నీతో అచ్చటికేగుదెంచుట ఎంత అవివేకమో నీవే యోచించుకొమ్మ.

దాక్షా: పరమేశ్వరా! మిమ్ము... నాతండ్రి.... బహిష్కరించెనా? ఎంత కర్ణకఠోరమైన వార్త.... నాగుండె బ్రద్దలగుచున్నదే! నా కోసమేమహాప్రళయము సంభవించినట్లున్నదే! వజ్రతుల్యమైన నాహృదయము ఛేదింపబడుచున్నట్లున్నదే! నాతలపై వేయి కోట్ల పిడుగులు పడుచున్నట్లున్నవే ! ఎంతదారుణము..... సర్వ దేవతలలో సర్వజ్ఞుడైన పరమేశ్వరునకు బహిష్కారమా? నే ను వినజాలను. నాకేదో మతిభ్రమకల్గుచున్నది. నేనీయవమానమును భరించి సాటిసురకోటిలో తలయెత్తుకోగలనా? పరమేశ్వరా!

వేదవేదాంగపారంగతుడైన, దక్షప్రజాపతి ఇంతమందబుద్ధియై వర్తించునని నేను కలనైనను దలంపలేదే! ప్రభూ! నేనిదినమ్మజాలకున్నాను. ఒకవేళ యేదురితాత్ముని ప్రోత్సాహముతోడనో దక్షుడట్లొనర్చియుండినను, నేను మందలించి తప్పక సన్మార్గానువర్తిగా నొనర్పగలను. సర్వేశ్వరా! నాకనుజ్ఞయొసంగినచో ఇప్పుడే వెళ్ళెదను. ప్రాణేశ్వరా!

ఈశ్వ: దాక్షాయణీ! త్వరపడుచున్నావు. నీ తండ్రి నీవనుకొన్నంత సులభప్రసన్నుడుగాడు. ఇప్పట్టున మన ముఖమాతనికి చూపకుండుటయే మంచిది.

దాక్షా: పరమేశ్వరా! దక్షప్రజాపతికి మీతోడి విరోధమేల గల్గెనో తెలుసుకొనవచ్చునా?

ఈశ్వ: దాక్షాయణీ! తెలిసికొనవలెనను కోర్కెయుదయించినదా? అయినచో వినుము. ఇటీవల చతుర్ముఖుడొక సత్రయాగంబొనర్చెను. దానినవలోకించుటకై, దేవ, ముని, ముఖ్యులెల్లరును విచ్చేసియుండిరి. నేనును పోయియుంటిని. మీతండ్రి యచ్చటికేగుదెంచు సరికి బృందారకు లెల్లరును ప్రత్యుత్థానమొనర్చిరి. నేనును, బ్రహ్మదేవుండును నేదియో సంభాషించుకొనుచు మీ తండ్రిగారి రాకను గుర్తింపకుంటిమి. అదికారణంబుగా నాపై కోపించి, దుర్భాషలాడి కడకు శపించి వెళ్ళిపోయెను. మరల యొకనాడా ప్రజాపతి నాయాశ్రమస్థలంబునకేతెంచెను. యోగనిష్టలోనున్న నేను లేచి, ఆయనను అర్ఘ్యపాద్యాదుల పూజించలేదని, దురభిమానంబున నోటికివచ్చినట్లువాగుటయేగాక "హవిర్భాగంబికముందు నీకు చెందకుండుగాక" అని శపించి వెడలిపోయెను. ఈనాడా శాపోక్తులు ఫలించినవని లోకమున కెరుకవరుచుటకై తానేపూనుకొని ఈశాన్యాధిపతినైన నన్ను ద్రోసిపుచ్చి బృహస్పత్యాగమొనర్చుచున్నాడు... ఇదీ జరిగిన విషయం. ఇక జరుగబోవునది నీకన్నుల యెదుటనే జరుగగలదు.

దాక్షా: పరమేశ్వరా! మామ - అల్లుండ్రమధ్య నింతటి ఘోరవిరోధాగ్ని ప్రజ్వరిల్లుచున్నదని ఎవ్వరేనియు నెఱిగింపకపోయిరే! కడకు మీరైనను నాకెఱిగింపక నీవిషయమింత కాలము దాచి యుంచుటకేమి హేతువు పరమేశ్వరా! సప్తసాగరము లేకమై పొంగివచ్చినన్నుముంచి వేయుచున్నవో అన్నట్లు, ఈ ఘోరవార్తనన్నలమటింప జేయుచున్నది. ప్రభూ! మీరిరువురును నాకు సమానులే. అయినను అట్లు పరిహాసాస్పదనై నేను సురలోకమున తలెయెత్తితిరుగగలనా దేవదేవా! దక్షప్రజాపతి మీయెడనపచారమొనర్చిన వాడగుటచే నాకును విరోధియయ్యెను. అట్టి మాంద్యుని మందలించియైనను, భయపెట్టియైనను, సన్మార్గమునకు మరలించుటయే నాకర్తవ్యము. మీయాజ్ఞయైనచో ఇప్పుడే పయనించుదాన.

ఈశ్వ: దాక్షాయణీ! నీతండ్రిని చక్కబరచుట నీవనుకొన్నంత సులభము కాదు.

ఉ|| *నాకు విరోధియై మనలు నైజమదాంధుడు నీదుబోధనల్*
*చేకొని సత్పథంబునకు జేరగరాడు నిజంబునీపోవుచో*
*పోకలు పోవుచుంటివెటు బోయెటువచ్చునొసుంతయేనియా*

ఉ|| *జనకుడు త్రోసిపుచ్చినను సాంత్వనవాక్కులచేరదీసినా*
*జననియుసోదరీమణులు సర్వవిధమ్ముల గౌరవింత్రునా*
*మనము ప్రవర్ధమంద వలుమారులు మిమ్ముదలంత్రువారు మీ*
*రనుకొను రీతివర్తిలుమదాంధులు గారు భుజంగభూషణా.*

ఈశ్వ: దాక్షాయణీ! అమాయక సంఘానికి నీవు అధ్యక్షురాలవుగా నుండదగినదానవు. కనుకనే నిట్లు మాట్లాడుచున్నావు. నీతండ్రికిని నాకును ప్రబలవైరుధ్యము వర్తిల్లుచున్న సమయమిది. కనుకనే మీతండ్రి మనముఖము చూడ కుండునట్లెల్లరను శాసించి, కట్టుదిట్టమేనాడో జేసియుండును. అకారణముగ నీవుట్టింట నొక్కరైనను నీముఖముజూచి యానందింవరు. కడకు సేవకులు సైతము ముఖముచాటు జేసికొందురు. నీతండ్రియునిన్నవమానింపక మానడు.

గీ|| *ఘోరరణమందు వీరాధి / వీరవరుల*
*బాణఘాతమ్ములను సహిం / పంగవచ్చు*
*కాని బంధువు బల్కిన / కఱకు పల్కు*
*విని సహింపగవచ్చునే / వనజ వదన*

కావున - అరక్తములోని రక్తమైన నీవును విజృంభింపకమానవు అందువలన నెట్టిముప్ప వాటిల్లగలదో చెప్పజాలను. కాన దాక్షాయణీ! నామాటపాటించి నీ ప్రయాణంబు మానుకొనుము.

దాక్షా: నాధా! త్రిజగన్నాధా! ఈవిషయమైమీరెన్ని చెప్పినను, నాహృదయావేదన చల్లారకున్నది. దక్షప్రజావతి నామొగముచూడక పోయినను పోవుగాక. అకారణంబుగానే, నాబంధు మిత్రుల సమక్షంబున నాతని దుర్ణయంబును నిరూపించి బుద్ధిచెప్పించి వచ్చెద గాక, కాన తప్పక నాకనుజ్ఞయొసంగవలసినదనియే ప్రార్థించుచున్నదాన.

ఈశ్వ: హుం...(తలపంకించి) సరే! నీవంతటి పట్టుదలవహించి పోదలచినచో పొమ్ము... "స్త్రీబుద్ధిప్రళయంకరి" అని ఆర్యులేనాడో వచించియున్నారు. నా అభిమతంబును త్రోసిపుచ్చి యరుగుచున్నావు. దాని ఫలితంబును నీవే చవిచూడగలవు.

దాక్షా: పరమేశ్వరా! ముందు చూచిన నూయి, వెనుక జూచిన గొయ్యి అన్నట్లు నాబ్రదుకు అధ్వానమైనది. కరికంఠీరవంబుల విరోధంబుపగిది, దక్ష విరూపాక్షుల విరోధంబును పరమాన మగుచున్నది. ఇప్పట్లున నేనూరకుండినను కావలసినది కాకపోదు. తదుపరి నేజేయునదేముండును? కాననిప్పుడే పోయి, చతురత చతురోపాయంబులు బ్రయోగించి నాతండ్రికి కర్తవ్యంబు ప్రబోధించెదగాక! (ముందుకు ఒక అడుగు) (తుమ్ము శబ్దము)

# తృతీయాంకము – 2రంగము.

(రంగ స్థలమునందు యజ్ఞశాల నేర్పాటు చేసియుంచవలెను.)

దక్షుడు యజ్ఞగుండమునకు చేరువగా కూర్చుండి యుండును. నలుగురు బ్రాహ్మణులు స్వాహాకారములు పలుకుచుందురు.

1వ బ్రాహ్మణుడు: *ఇంద్రాయైతుప్పూర్వం - ఆగ్నేయమగ్నిం*
*యమాదక్షిణం - నైఋతిం నిఋతి - వరుణాపశ్చిమం*
*వాయవ్యం వాయుః కుబేరా ఉత్తరం- ఈశాన్యం నహి-నహీ*
*ఈ శాన్యం - నహి, నహీ*

దాక్షా: (చండీశ్వర - ముండీశ్వరులతో తెరకు ముందువైపున ప్రవేశించి ఈశాన్యం నహి, నహి, అనుటవిని ఆశ్చర్యమభినయించి) ఆహా! ఏమీ యీ విపరీతకాల విజృంభణము - ఇది ఇతః పూర్వ దక్షప్రజాపతినిలయమా! లేకయేదేని మధుపానమత్తచిత్తంబున శివదూషణలొనర్చు హేయమానవుల కావానంబగు పానశాలయా! కాదేని, క్షీరసాగరంబున కాల కూటంబుద్భవించినట్లు దక్షప్రజాపతి పవిత్రహృదయంబున శివద్వేష విషానలముద్భవించెనా? అనవరత పరమేశ్వర పాద సేవా పరాయణయైన యీదాక్షాయణీ దేవి తనతండ్రి నోటనే శివనిందాలాపముల వినుటయా? ప్రశస్త చరిత్రుడైన పరమేశ్వరుని అల్లునిగాబడయగల్గిన అదృష్టజాతకుని గృహంబునుండి శివనామోచ్ఛారణ బహిష్కరింపబడుటయా? "వినాశకాలే విపరీతబుద్ధి" యన్నట్లు దక్షుని యావరించిన యీదుర్బుద్ధి కతంబున తనకుటుంబమునకే కీడుమూడనున్నదో గదా (కన్నుల నీరుతుడుచు కొనుచు లోనికేగును)

చండీ-ముండీ: ఏమహోపద్రవము రానున్నదోగదా!

దాక్షా: (తండ్రి యెదుటకేగి) తండ్రీ! నమస్కారములు.

దక్షుడు: (దాక్షాయణివైపుజూచి చకితుడై _ కోపమునభినయించుచు, దీర్ఘనిశ్వాసములు విడుచును.)

బ్రాహ్మ: ఇంద్రాయైతుప్పూర్వం..... ఈశాన్యం నహి, నహీ

దాక్షా: ఓరీ! పురోహితులారా ! ఆగుడు - మీచదువు సంధ్యల బండారమంతయుబయట బడినది కానీ - ఇక చాలింపుడు.

దక్షు: (మహాకోపముతో లేచి) దాక్షాయణీ! పిలువకనే పేరంటమునకు విచ్చేసిన నీవు అనవసరప్రసంగములజోలికి బోక అవలకుబొమ్ము.

దాక్షా: తండ్రీ! ఏమిటీ - నిర్హేతుకాగ్రహావేశములు - నీకేమైనా మతిపోయినదా!

గీ|| *కన్నకూతురు ప్రీతియై / గడవద్రొక్క*
*మండిపడుచుంటివేలకో / మాన్య చరిత*
*తప్పుగలదేని నాయందు / తాల్మితోడ*
*మందలించిన నేర్పుగా / మనలు కొననే.*

తండ్రీ! పరమేశ్వరునవమానించి, నీయాధిక్యత ప్రకటించుకొనుటకే - నీవీ - అపూర్వ యజ్ఞమును చేయతలపెట్టినట్లున్నది. ఎదుటి వారిని గౌరవించి, తాముగౌరవింపబడిన మాన్యులెందరో గలరు. కాని, పరులకించిపరచి తాను మంచివాడనిపించుకొన్న వాడొక్కడైనను దిక్కులందెక్కడను గానరాడు. బుద్ధిపూర్వకముగా నీవేల యీ దుష్కార్యమునకు బూనితివి తండ్రీ!

దక్షు: దాక్షాయణీ! వేదవేదాంగపారంగతుండనై, కావ్యేతిహాస పురాణాదులనెల్ల కరతలామలకమొనర్చుకొన్న నేను - నీయొద్దనీతులు నేర్చుకొనవలసిన పనిలేదు. నవబ్రహ్మలలో మేటియనిపించు కొన్న యీదక్షప్రజాపతి బంధుప్రీతిచేతను, అల్లుడన్న ఆదరాభిమానములచేతను, నిర్భాగ్యమైన నీగడపద్రొక్కి, నీమగనిని ముమ్మారులు ముక్తకంఠంబున, పేరు పేరున బల్కరించినను పల్కకూడదన్న దురభిమానంబున, "బెల్లముగొట్టినరాయి" వోలె కూర్చునియుండుట నీమగడొనర్చవలసిన మర్యాదకార్యమేనా! మరియీ అతీతమైన నీతులాతని కేల బోధింపలేక పోయితివో.... పాపం....

మ|| *వనజాతానను వంశవర్ధనుడనై, వైశద్యమొప్పారునా*
*ఘనతన్ జూచి మహామహుండు మనువేకంజాత వక్త్రేక్షణన్*
*తనయారత్నము నిచ్చి యుండ నౌరా! నాకున్న యాధిక్యతన్*
*గనలేకా విధి గర్వభావమునన్గాసింబెట్టునే అల్లుడే!*

ఛీ......ఛీ........ ఇట్టి దరిద్రదామోదరునల్లునిగా నెన్నుకొనుటయే నాబుద్ధి పొరబాటు.

దాక్షా: నాన్నా! పరమేశ్వరుడు యోగ్యతాయోగ్యతలెరుంగని వాడా! చరాచరప్రకృతి యందలి నిఖిల భూతంబులును ఆయన అధీనములేగదా! అట్టి నిర్మల ప్రవృత్తి గల మహానుభావుని డెందంబున స్వపరభేదంబులుత్పన్నమగునా? ఎంతమాటంటివి?

పరమేశ్వరుడు మాయాధీన భూతజాలంబువలె ప్రాపంచిక విషయలోలుడై, అరిషడ్వర్గాధీనమానసుండై, అవి త్రిప్పినట్లు తిరుగువాడుకాదు. అది నీవుగమనింపకయే ఆయనను అపార్థము చేసికొనుచున్నావు. త్రికరణశుద్ధిగానామహాత్ముడు నిన్నునిరాకరించి యుండడు. అది నీవు గ్రహింపకయే పొరబడుచున్నావు.

మ|| *శతశాతమ్ముగవేద శాస్త్ర మహితత్సారాంశమున్ గ్రోలి సం*
*స్కృతిహీనుండును బోలె మోహ్వాతమమున్ జాటింతువే తండ్రి జీ*
*వితమందాయవకీర్తి మోయగలవా? విశ్వజ్ఞు, విశ్వేశునే*
*మతిలేకుండిన వాడు సైతమిటులన్మాటాడునే మూర్ఖతన్.*

క్షు: కౌమారీ! ఓడతోగట్టిన ఓడవోలె - నీవునూ నీమగని మార్గానువర్తివై మాటాడుచున్నావు. నాజగజ్జేగీయమానప్రజ్ఞావిభవంబుల కసూయాగ్రస్తుడైన నీనాథుని లోపంబులెల్లకప్పిపుచ్చి గొప్పలు చెప్పుటకే సాహసించుచున్నావు. ఇట్టి అసంబద్ధములైన వాక్యములు నాయొద్ద వాక్రుచ్చకుము.

క్షా: నాన్నా! శంకరుడు అసూయాగ్రస్తుడా! పాపభూయిష్ఠుడా! లోకైకారాధ్యుడైన యా పరమేశ్వరునట్లు నిందింపకునాన్నా.

క్షుడు: హు! నిందింపకూడదు. కానీ, బంధింపవలెను. నీచాతినీచుడైన వాడెంత? వాని భవిష్యత్తెంత? అతని తప్పుకుదగిన శాస్తియొనర్చువరకు ఈ దక్షప్రజాపతినిదురబోడని నిశ్చయించుకొమ్ము....

క్షా: పాపముశమించుగాక - (చెవులుమూసికొనును) (తలయెత్తి కోపముతో) సర్వసర్వాంతర్యామియై, సర్వలోకరక్షకుడైన శంకరుని నీకింకరుడుగా భావించచున్నావేమో? జాగ్రత్త! మేరమీరిన వాక్పారుష్యముతో వదరుచున్నావు. ఇందుకు తగిన ఫలమనుభవింపక తప్పదు. ఇకనైనను జాగృతుడవుకమ్ము.

సీ|| *మృగరాజు నిరింప / నెగిరి ముందుకుసాగు*
*మత్తేభమొకలిప్త / మనగ గలదె*
*వైనతేయునితోడ / వైరంబుదలపెట్టి*
*సర్పమొక్కడు గేని / చనగ గలదె*
*వింధ్యాచలమ్ముతో / వేగఢీకొనబోవు*
*తగరుకాసింతేని / మిగులగలదె*
*అగ్నికీలలు మ్రింగ / నార్పాటమునబోవు*
*శలభంబు జీవింప / జాలియున్నె*

గీ|| బెబ్బులి నెదుర్కొనులేడి | పిల్లగలదె
రాజునెదిరింప జనువేద | రాలుగలదె
ఇట్టిదేయగు నీవు సర్వేశ్వరునకు
నెగ్గుదలపెట్టియీర్ష్యతో | నెగసి వడుట

దక్షు: దాక్షాయణీ! తండ్రీ బిడ్డల తారతమ్యమునేదాటిపోవుచున్నావు. వదరుబోతునన్నిహితురాలవై, వాక్పారుష్యమలవరచుకొని ధీరుడైన నీతండ్రినే ధిక్కరించి మాట్లాడుచున్నావు. తగిన బుద్ధిచెప్పి పంపుటకు ఆడుబిడ్డవని వెనుకాడుచున్నాను. నీమహాపురుషుండేమిట ఘనుండో నిరూపించగలవా?

సీ|| వైకుంఠునకుసాటి| వచ్చునటందువా
బిడియమించుకలేని | బిచ్చగాడు
బ్రహ్మదేవునికంటె | ప్రాజ్ఞుడంచందువా
కొంగజపములొనర్చు | దొంగమౌని
అమరేశ్వరుని బోలు | నైశ్వర్యవంతుడా
కాటిలోన వసించు | కర్మఠుండు
నన్నుబోలినమహా | జ్ఞాని యంచందువా
మూర్తీభవించిన | మూర్ఖుడతడు.

గీ|| ఇట్టిదౌర్భాగ్యుడే జగ | జ్జట్టిగాగ
నీకుగన్పట్టుచుండు వ | ర్ణి వియుగాన
మూడు కన్నులు గలవంచు | మురియుదేమొ
అంతకంటెను వానిప్ర | ఖ్యాతియేది?

దాక్షా: (కోపముతో) నాన్నా! నీలకంఠుడు నీవలె ఐహికభోగలాలసుడుగాడు. మణిమయసౌధంబుల నష్టైశ్వర్యంబుల ననుభవించు చక్రవర్తియైనను, కటికవస్త్రులతో కాలము వెళ్ళబుచ్చుదరిద్రదామోదరుడైనను, కట్టకడకుచేరునది ఆవల్లకాటిసీమకే. త్రిలోకములందెచ్చటను గాన్పించని సమానత్వమనెడు పవిత్ర భావము తాండవించునది ఆ శ్మశానవాటికయందే. తరతమ భేదముల పాటించు పరమమూర్ఖులకది నీచస్థానముగనే దోపవచ్చు. అట్టి పవిత్రస్థల నివాసియైన పరమేశ్వరుని హేయభావమున జూచిననీవు శివాపరాధమొనర్చినవాడవగుదువు. నా అల్లుడిట్టివాడని పలుమార్లు ప్రకటించుకొన్నచో, నీకై నీవేన్యూనతనాపాదింపజేసికొన్న వాడవగుదువు. అంతియేగాక........

సకల భూతేశ్వరుండు స/ చ్చరితుడైన
ఫాలనేత్రుని తోడనీ/ బద్ధవైర
మెన్ని దినములు సాధింప/ నెంచినావొ
అన్ని యుగములు దుష్కీర్తి/ నందగలవు.

దక్షు: (వికటాట్టహాసముచేసి) కుమారీ ! చక్కగా బల్కితివి. నా పరువు ప్రతిష్టలకు నప్రతిష్ట నాపాదించుకొన్నది యీనాడుగాదు.

కులమున్ గోత్రము బంధుగౌరవమునున్ కూలంకష ప్రజ్ఞయున్
కలిమిన్‌యోగ్యతలేని మూర్ఖుని బలాత్కారంబునన్ దెచ్చిమం
గళసూత్రంబును నీగళంబున తగన్ గట్టించునాడే నము
జ్జ్వల హోమాగ్నిని వ్రేల్చి నాద పరువున్ వంశోన్నతిన్
ప్రజ్ఞయున్.

మరి, ఏనాడోబుగ్గిపాలైన వాటి కొఱకై, యీనాడు వాపోవుటెందుకు? ఇక నీవికటవేదాంతముచాలించి వెళ్ళిపొమ్ము.

దాక్షా: (దుఃఖముతో) తండ్రీ ! దక్షప్రజాపతీ! అనశ్వరభోగభాగ్యములకు ప్రాధాన్యమొనంగి, శివదూషణముగావించినావు. దురభిమాన దుర్విదగ్ధుడవైన నిన్ను శంకరుడు పూలమాలవేసిపూరేగించలేదని యేగదా నీకార్పణ్యము. పిపీలికాది బ్రహ్మపర్యంతమూసర్వేశ్వరుని పాదరజంబును శిరంబునదాల్చి వరమపావనమగుచుండ, నీవునిరంతరధారావాహికగా శివదూషణలొనర్చి, ఆ పరమేశ్వరుని కరుణా కటాక్షములకెంతయోదవ్వగుచున్నావు. ఆ దయామయుడైన ఈశానుని ప్రసంగ వశమున నొక్కసారి "పరమశివా!" కాపాడుమని ప్రార్థించినంతనే జన్మజన్మాంతర ప్రారబ్ధములు పటాపంచలైపోగలవు. అట్టి పవిత్రమైన శివనామామృతమేనీకుయేవగింపైనది. ఇక నీజన్మమెట్లు కడతేరగలదో పూహింపలేకున్నాను.

మదమున నెవ్వడేని శశిమౌళినెరుంగక దూఱుచుండ న
య్యది విని వానినాల్క నరియందెగగోయకయున్న యాతడు
న్మదగతి పావకూపమున మ్రగ్గిన శించునటండ్రు పెద్దలే
నదియొనరింపజాల నిటలాక్షుని జేరగజాల నిత్తరిన్

అంతియేగాదు నాన్నా!

*ఉదరమునిండ దూష్యమగు నోగిరమున్ భుజియించివెంటనే*
*యది వెదలంగ గ్రక్కితనయాత్మ విశుద్ధినిపొందు రీతినే*
*నెదొ దురితంబొనర్చి కడుహీనుని నీదకుమార్తినైతినే*
*దదికను గొంటిగాన తనువగ్నిదహించి పవిత్రనయ్యెదన్*

దక్షుడు: దాక్షాయణీ! పవిత్రమైన నీపరంపరనెఱుంగక మాట్లాడుచున్నావు. నాతండ్రి చరాచరసృష్టి కర్తయగు బ్రహ్మదేవుడు. నీతల్లి చతుర్దశమనువులందగ్రగణ్యుండైన స్వాయంభువ మనువు కూతురు. ఇట్టి పరమోత్కృష్ట జననీ జనకుల కుద్భవించుటచేతగాదు నీవపవిత్రురాలవైనది. ఆ నికృష్టునకు భార్యవగుటచేతనే.... ఈ విషయము బాగుగా యోచించి కొనియే యుపక్రమింపుము.

దాక్షా: (శివశివాయనుచు చెవులు మూసికొని) ఓరీ ! పాషండుడా శివాపచారమొర్చిన పాపాత్ముడు కోటి జన్మలెత్తి సహస్రకోటి యజ్ఞంబులొనర్చినను తద్దోష పరిహారమొనర్చుకొనజాలడు. నానసమక్షముననేగాక ప్రత్యక్షముగా పరమేశ్వరుని దురూక్తులాడిగడించుకొన్న నీపావమసంఖ్యాక వర్షంబులు తల క్రిందుగా తపమాచరించినను తొలంగదు. ఆ పరమపావనుని త్రిలోకాధి పత్యంబును జూచి యోర్వలేక క్రోధోన్మత్తమాతంగము వోలె ఘీంకరించుచున్నావు. జగదారాధ్యుడైన ఆదిశంకరుని తేజో మహిమచేతిరస్కరింపబడిన నీవు గర్హితంబగు నీక్రోధార్ద్ర హృదయంబున మోసులెత్తిన రజోరూపరాగద్వేషాదులనాలంబన మొనర్చుకొని, ఈ శాన్యాధిపతిలేని యజ్ఞమొనర్చుచున్నావు. ఈ యాగ సమాప్తమే నీయాశ్వాసాంతమని తెలిసికొమ్ము. ఆడుబిడ్డ కన్నీటి బిందువులు అనివార్యప్రవాహమ్ములై, నిన్నూ నీవంశాన్ని తుడిచిపెట్టిపోగలవని తెలిసికొమ్ము.

చండీశ్వర - మునీశ్వరులారా! నాతండ్రిశివద్వేషియై, అస్పృశ్యతనాపాదించుకొనెను. అట్టివానితనూజాతంబైన నాతనువుగూడ అపవిత్రమైనది. కావున యీతనువు ఈ దక్షప్రజాపతిసమక్షముననేయోగాగ్ని యందు దగ్ధంబుగావించి, పవిత్రురాలనై, పరమయోగీంద్రులబోలి సహస్రాబ్దులునన్ను గూర్చి తపంబొనర్చిన పరమయోగ్యుడా తుహినాచలాధినేతకు కుమార్తెనయ్యెద.

నా ప్రాణనాథున కీవిషయంబెల్ల విశదంబుగావించి జన్మజన్మలకు నీవే హృదయేశ్వరుడువు కమ్మని ధ్యానించుచు ప్రాణోత్తమణ మొనర్చినదనివిన్నవింపుడు. నాయీకడసారి నమస్కారములు ఆ పరమపావనుడైన నామనోనాథున కర్పింపుడు.

(అని పలుకుచు పద్మాసనాసీనయైకూర్చుండును)

(చండీశ్వర - ముండీశ్వరులు సాష్టాంగ నమస్కారములర్పించి దుఃఖింతురు.)

ఓ పరమేశ్వరా! లోకరక్షకా! దీనదయాళో! నీపాదదాసియైన యీ దాక్షాయణీ, నిరుపమాన తత్వజ్ఞుండవగునీమాట తోసిపుచ్చివచ్చి నందుకు ఫలంబుగా దుర్వారగర్వాంధుడైన తండ్రిచే నవమానింపబడి భరింపరాని పరాభవంబున మనంబు రగుల్కొనుచుండ మానమక్షమునకేతెంచి మొగము చూపింప జాలక తండ్రి యెదుట నేతనువు చాలింప సిద్ధపడుచున్నది.

భక్తవరదా! యీదీనురాలి ఆర్తారవంబువిని కరుణాంతరంగుడవై, అవివేకంబున నాచేనొనర్పంబడ్డ దొనంగులలెక్కింపక క్షమించి జన్మజన్మంబులకు నా మనోనాథుండవైనన్ననుగ్రహించుదేవదేవా!

ఓ సకల సురముని గణవర్గంబులారా! ఈ దాక్షాయణీదేవి దగ్ధము కాబోవు చున్నది. కారణంబేమిటో గ్రహింపుడు.

(పాటపాడును)

(చండి-ముండి పెద్దగా నేడ్చుచుందురు. చుట్టునగ్ని జ్వాలలు గ్రమ్మును.)
(తెరకొంచెము దించబడును)

*నామనో నాథుడే లోకనాథుడేని*

*పరమ శివభక్తినాలోన బరగునేని*

*అగ్ని దేవుడు నాయాజ్ఞ / నరయునేని*

*దగ్ధమొనరించుగాతనీ / దక్షసుతను.*

(తెరపూర్తిగా దించబడును.)

## తృతీయాంకము — మూడవ రంగము

(పరమేశ్వరుడు ఆలోచనా నిమగ్నుడై కూర్చుండి యుండును)

ఈశ్వ: (ఉన్నటులుండి చలించి) ఏమిది? నామనంబేలకో కలతచెందు చున్నది. పురుషులకశుభసూచకంబగు వామనేత్రమదరుటయు

వింతగానున్నదే? ఏదుర్వార్త వినబడనున్నదో గదా..... ఇంతకూ పుట్టింటికేగిన దాక్షాయణీ విషయమై యేమియుతెలియరాకున్నది.

చం: హర, హర, మహాదేవ శంభో శంకర ( రెండుసార్లు)

ముం: హర, హర, మహాదేవ శంభో శంకర (రెండుసార్లు)

చం: దేవదేవా! ఆదిశంకరా! పరమేశ్వరా! పాహిమాం - పాహి

ముండి: ఫాలలోచనా! పరమశివా! నీలకంఠా! పాహిమాం - పాహి.

ఈశ్వ: భృత్యులారా! ఏమిటీయార్తనాదము.

చండీ: ఏమని చెప్పుదుముదేవా!

ముండి: ఏమిచెప్పుటకును నోరాడుటలేదు మహానుభావా!

ఈశ్వ: దక్షప్రజాపతి మిమ్మేదేనిదండించెనా?

చం: అదికూడా జరిగిందిదేవా?

ముం: అవునవునుదేవా!

ఈశ్వ: దాక్షాయణీయైనా దక్షుని మందలించలేదా?

చండీ: మందలించింది - మందలించింది ప్రభూ!

ముండి: ఎదిరించింది — ఎదిరించింది ప్రభూ.

ఈశ్వ: ఇంతకూ దాక్షాయణీ పుట్టింటనే యున్నదా?

చం: అయ్యో! మహాదేవా! ఇంకెక్కడి దాక్షాయణీ తండ్రీ!

ముం: మాతల్లి మాట మేము నిన్ననే మరచిపోయితిమి తండ్రీ!

ఈశ్వ: (ఒక్కసారిగా చకితుడైలేచి) ఆఁ.....దాక్షాయణి యేమైనది? ఎచ్చటనున్నది? త్వరగా చెప్పుడు.

చం: దక్షప్రజాపతిపలికిన మాటలకు రోషపడి... దగ్ధమై...... పోయింది... ప్రభూ!

ఈశ్వ: (కుమిలినట్లుకూర్చుని-దుఃఖమభినయించి) అయ్యో!.... దాక్షాయణీ! పరాభవంబునకు ప్రతిక్రియగా, దక్షుని సమక్షముననే... దగ్ధమై ..... పోయితివా... దేవీ! ఈ ప్రయత్నమీవిధముగా సమాప్తమగునని నేనే నాడో వచించితిని. నీపుట్టింటిపై మమకారంబున నామాట త్రోసిపుచ్చిపోయితివి. పోయిన దానవుపోయినట్లే.... అదృశ్యమైతివి దేవీ! యెంత ఘోరము జరిగిపోయినది దేవీ!

ండి: తల్లిగారెంతయుత్సాహంబున పుట్టింటి కేగెనో.... అంతకు రెట్టింపయిన పరాభవంబుననుభవించి, యోగాగ్నిలో మాయమైపోయినది ప్రభూ!

ముండీ : జన్మజన్మకూ మిమ్మే భర్తగా దలంచుచూ, క్షణికలో నొక బాలికగా రూపొంది, ఉత్తరదిక్కుగా నాకాశమార్గమున పయనించిపోయినది ప్రభూ.

ఈ : హా! దాక్షాయణీ! త్రిలోకమోక్షప్రదాయనీ! ఎంతటిదారుణకృత్యమున కొడిగట్టితివి దేవీ! ముక్కోటిదేవతలు ముడివేసిన యీదాంపత్యబంధాన్ని ఒక్కమాటతో తెగద్రెంచుకొని విడివడితివా దేవీ!

నీ భువన మోహన లావణ్య స్వరూపము నిక దర్శించుభాగ్యమీయదృష్టహీనునకు లేనట్లే నా దాక్షాయణీ! నీలలిత సుకుమార పల్లవ హస్తములతో పాదములు గడిగించుకొను భాగ్యమింతటితో సమాప్తమైనట్లేనా? నీపరమపావన శరీరస్పర్శతో నుత్ఫుల్లమగు నా హృదయకంజమిక వాడిపోయినట్లేనా? నీ మృదుమధురవాక్యప్రవంతిలో తేలియాడు నదృష్టమీ నిర్భాగ్యునకిక తొలగి పోయినట్లేనా? నీ ప్రణయనిక్వాణ వీణా నినాదంబుతో మేల్కొల్పబడుచున్న నా మధుర హృదయమిక మాంద్యమున మునిగియుండవలసినదేనా? నీయధరమధుర సుధారసంబును తనివిదీర గ్రోలుచున్న యీరసనేంద్రియమిక సన్యసింపవలసినదేనా?

అక్కటా! ఎందుకింతటి వైరాగ్యము నీ హృదయములో చోటుజేసికొన్నది దాక్షాయణీ! పరమపావనమైన నీపాద స్పర్శ లేనిదే యీకైలాసము కాంతి మంతము కాదే. నిరుపమాన సౌందర్యరాశివైన నీవులేనిదే యీరజితాచలమురాణింపదే. మూడువేళలా నిన్నుసేవింపనిదే వచ్చిగంగనైనా ముట్టని మహాభక్తులున్నారే. వీరందరి గతియేమికావలెనని నీశరీరమును త్యజించితివి దాక్షాయణీ!

సీ|| *సర్వమంగళనాదు / సన్నిధిన్నెడబాసి*
*ఏమహోన్నతికిటో / నెంచినావో*
*దాక్షాయణీ దివ్య / ధామంబు విడనాడి*
*ఏధరాస్థలిజేర / నెంచినావో*
*మాహేశ్వరీ! శిష్య/ మండలివిడనాడి*
*ఏమహర్షులపాలి / కేగినావో*
*కాత్యాయనీ! నాదు / కౌగిలి నెడబాసి*

గీ || *వరమసాధులు నీభక్త / వరులునురలు*
*నందికేశ్వరుడాదివి / జ్ఞానధనులు*
*గుండెలవియగదుఃఖాన / కుమిలికుమిలి*
*మూర్ఛిలిరి నేడు నీకత / మ్మునసాధ్వీ.*

దేవీ! ఏనిర్భాగ్యుడు నీకి దుర్యోగమును కల్పించెనో నాకెరుకలేకపోలేదు. ఏ మహా పాపి నీమనోవైకల్యానికి కారకుడైయింతపని జరిగించుననియు నాకు తెలియును. బ్రహ్మ వంశమునకెల్ల కళంకమునాపాదించిన పాపాత్ముడైన దక్షునకు ప్రజాపతిత్వమొసంగి లోకమున చిచ్చుబెట్టిన చతుర్ముఖునిదే బుద్ధిహీనత. తన సృష్టిలో స్త్రీ జాతి కింతటి తెగువనుగల్పించి, పురుషుని వికలత్వమునకు కారకుడగుటయు సహింపదగినదికాదు.

ఓరీ! కమలాసనా! ఏఘాతుక కృత్యములాపాదింపజేసి నీవునంతసించుచున్నావో, వాని వలన నీవే లోకనిందల పాలవుదువుగాక.!

మ|| *ఎడబాటన్నదియే యెఱుంగని సఖీ! యీరీతిదాంపత్యమున్*
*ముడిభేదంబున నుత్తరించుకొనినిర్మోహంపుదావాగ్నిలో*
*బడిదగ్ధంబయిపోయినావె, చెలినీభావంబెయీరీతిగా*
*కదునై శిత్యపుపోకడన్ గొనగ, దుష్కాంతల్ యోర్పుమైనుందురే!*

ఓరీ! దక్షా! నిన్నికశిక్షింపకయుపేక్షించినచో లోకరక్షాదీక్ష బద్ధకంకణుడనైన నేనే లోకములనశింపజేసినవాడనగుదును. నీకుటిలవర్తనంబునకు ఫలితంగా, ఈనిటలాక్షుని కుటిలభ్రుకుటికాతీక్షణంబును దెలిసికొందువుగాక!

శా|| *నేనేలోకలయాధినాయకుడనేనిన్ విస్మయాపాదినై*
*నానాలోకభయంకరార్భటుల నజ్ఞానాంధుడౌ దక్షుని*
*ర్యాణ ప్రక్రియ కుత్సహింపగల రౌద్రాకార భద్రుండొకం*
*డీనాదివ్యజటాగ్రఘాతమున దానిప్పట్టునంబుట్టుతన్.*

(జటను పెరికి క్రిందగొట్టి, ఆవేశముతో వూగినలాడుచుండును)

(తక్షణమే వీరభద్రుడు పుట్టి)

సీ|| *భుజగేంద్రహారాయ | భూతాధినాథాయ*
*నిత్యానురాగాయ | నిర్మలాయ*
*గంగాధినాథాయ | ఖండేందు చూడాయ*
*దేవాదిదేవాయ | దేశికాయ*
*వేదాంతవేద్యాయ | విశ్వావతారాయ*
*శూలాయుధకరాయ | శుభకరాయ*
*మోహనాకారాయ | మోక్షాను సంధాయ*
*భువనాభిరామాయ | పురహారాయ*

గీ|| *సచ్చిదానందభావాయ | శంకరాయ*
*హరిహర బ్రహ్మదేవాయ | అవ్యయాయ*
*శక్తి సంస్తూయ మ్యానాయ | శాశ్వతాయ*
*ఓం నమశ్శివ రూపాయ | ఉజ్జ్వలాయ.*

(అని వీరభద్రుడు ప్రార్థించుచు స్టేజీ మధ్యకు వచ్చి శివుని ముందు మోకాళ్ళపై కూర్చుండి నమస్కరింపుచు తలవంచి)

వీరభ: జనకా! నిటలాక్షుండవైరోషావేశంబున బ్రకాశించుచు నన్ను జనియింపజేసిన కారణంబేదో తెలిసికొనవచ్చునా?

ఈశ్వ: వీరభద్రా! సావధానుడవుగమ్ము. యుక్తా యుక్త విచక్షణారహితుండైన దక్షుండనువాడు పెచ్చుబెరిగిన మత్సరంబున, నన్ను తుచ్ఛునిగా భావించి, వానియిచ్చవచ్చినట్లు ప్రేలి, శాపాక్షరంబులనుచ్చరించియున్నాడు. అంతియేగాక నీతల్లిదాక్షాయణీ దేవి ఆ తుచ్ఛుని మూలముననే, అగ్ని జ్వాలలకాహుతియగుటయు తటస్థించినది. ఆదక్షుని.....

వీరభ: శిరచ్ఛేదనంబొనర్పుమనియేగదా మీరు సెలవిచ్చునది.

(అనుచు వీరత్వము ప్రదర్శించును)

ఈశ్వ: కావచ్చును. కానీ..... ఎట్టి దురాత్మునైనను మొదట సామోపాయమున చక్కబరువజూచుట సజ్జన లక్షణము. దానివలన ప్రయోజనము లేకపోయెనా? భయపెట్టి దారికి దెచ్చుట రెండవమార్గము. అదికూడ వ్యర్థమయ్యెనా, ఇక తప్పని సరిగా శిక్షించుటయే తక్షణకర్తవ్యము. ఈధర్మరహస్యముల ననుసరించి, ధర్మదేవతవోలె ప్రవర్తించి, ఆదక్షుని విషయము దేల్చుకొని రమ్ము. ఇదిగో త్రిశూలము. ఇది నీచేతనున్నంత వరకు త్రిలోకములేకమై వచ్చినను నాకాలిప్రేలి గోన గోటినైనను గదల్పజాలవు.

చం|| అనిమొన నిల్చినీవు ప్రమధాదుల కాజ్ఞలొనంగుమండవా
రని తరశౌర్యధైర్యవిభవాతిశయంబున నిల్చిపోరగా
ఘనులు విరించి విష్ణువులు గాక మహేంద్రదినేంద్ర
చంద్రముల్
కనలియెదిర్చి నిల్చినను కాలభయంకరు నిన్ను గెల్తు రే!

వీరభ: చిత్తము తండ్రీ ! మీయానతి శిరసావహింతును.

ఈశ్వ: వీరభద్రా! అదిగో మనసైన్యము.... భూత, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకిన్యాధి మహావీరులారా! (అని పెద్దగా కేకవేయును)

భూతములు: పెద్దకేకలు....ఓ.......ఓ.......ఓ.......ఓ

ఈశ్వ: ఆ సైన్యంబులకధినాథుండవై సామదానభేద దండోపాయంబుల కార్యంబునుచక్కబరచుకొని రమ్ము. చండీశ్వరా!

చండీ: ఛిత్తం ప్రభూ! (అంటూవచ్చితలవంచినిల్చుండును)

ఈశ్వ: వీరభద్రునాజ్ఞల శిరసావహించి, చేదోడువాదోడుగానుండి, సైన్యంబులకు సమయానుకూల సంరంభోత్సాహంబులరేకెత్తించుటకు వీరశంఖంబుల పూరించుచుండుము.

చండీ: చిత్తం ప్రభూ! (అంటూ ప్రక్కకుబోవును)

ఈశ్వ: ముండీశ్వరా!

ముండీ: చిత్తం ప్రభూ! (అంటూవచ్చి నిలుచుండును)

ఈశ్వ: నీవుమాత్రము వీరభద్రునకు మిక్కిలి సన్నిహితుడవుగానుండి, యుద్ధముననేవేని సందిగ్ధసమస్యలుత్పన్నములై, అసాధ్యములనిదోచినప్పుడు తక్షణమే ఓంకారనాదమొనర్చుము. నేనది గమనించి అపూర్వశక్తులనంపుచుందును. పోయిరండు. మీకు శుభంబగుగాక.

వీరభ: జనకా! ఒక్కదక్షుడేగాదు. చతుర్దశ భువనంబులనొక్క సారిగొనిరమ్మన్నను, తేగలసామర్థ్యమునాలో నిండియున్నది. అందులకు మీయాశీర్వాదబలమే కారణము. (అనికాళ్ళముందుకూర్చునును)

ఈశ్వ: కుమారా! ఆశీస్సులగోరుచుంటివా?

సీ|| భద్రుడా! నీకు విం | ధ్యాద్రినే బెకలించు
ఘనతరాద్భుత శక్తి | గల్గుగాక
అతిరోషభీషణుం | డాదిశేషునికోర
లూడదీయుబలంబు | లొదవుగాక
దివితారకలను చిం | దించి ఝల్లునరాల్చు
వరువమ్ము నీకు చొప్పడును గాక
ముజ్జగంబులనొక్క | మూటగా నంధించు
ధైర్యవిన్యాసంబు | దనరుగాక

గీ|| దిగ్గజాలమదోద్ధతి | ధిక్కరించి
యుక్కడించుబలోన్నతుల్ | దక్కుగాక
వర్ధిలుదుగాత! విదిత దు | ర్వారవీర
భద్రుడా ! నీవు సర్వతో | భద్రముగను.

వీరభద్రా ! ఇకసైన్యంబుల నాయత్తపరుచుకొనిపోయి దక్షుడు పాదదానుడో పదవీశిష్టుడో తేల్చుకొనిరమ్ము.

వీర: చిత్తము తండ్రీ! (అంటూ వీరభద్రుడు చండీశ్వర ముండీశ్వరులతో పోవును)

## తృతీయాంకము - 4వ రంగము.

(తెరఎత్తునప్పటికి చండీశ్వరముండీశ్వరులు సైనికులుగా నుందురు)

ముండీ: ఒరేయ్ చండీ ! గజసైన్యాధిపతినినేను.

చండీ: ఛ....ఛ.... గజసైన్యాధిపతిని నేను ....... నీవు అశ్వసైన్యాధిపతివే.

ముండీ: ఒరేయ్! చండీ ! నాలుగు ఓళిగలు ఒక్కపట్టున నమలి మ్రింగలేని వెధవ్వా నువ్వెందుకురా.... గజసైన్యాధిపతిగ....

చండీ: ఓరి అప్రాచ్యుడా! నాలుగు నాలుగులు పదహారు సుకీయలు అట్టేపడిసిపట్టి, పుక్కిటద్రోసి, నురిమిపారెయ్య గలనే.... మరి... నేనుగాక నువ్వెట్టవుతావురా గజసైన్యాధిపతివి.

వీరభ: ఛీ! తిండిబోతుల్లారా! మీభోజనపరాక్రమములుగ్గడించుకొనుట కిదియా సమయము.

చండీ: (గడగడవణకుచు) లే....లే..... లే....లేదు ప్రభూ!

ముండీ: (గడ గడవణకుచు) కా....కా.....కా.....కాదు ప్రభూ!

వీరభ: భృత్యులారా!

చం. ముం: చిత్తం ప్రభూ!

వీరభ: ప్రస్తుతమనకర్తవ్య మేమిటో తెలుసుకదూ!

చండీ: తెలియకుండావుంటుందా ప్రభూ!

ముండీ: తెలిసేవుంటుందిప్రభూ!

వీరభ: ఛీ! దద్దమ్మల్లారా!

శా|| *సత్యాసత్యవివేకశూన్యుడెవడో సర్వక్రియానాధుడౌ*
*నిత్యానందమయున్ మహేశ్వరునిదానిందించి, నిర్భీతి నా*
*ధ్ధత్యంబొప్పచరించుచుండెనట, నాదర్పాంధుదుర్నీతికిన్*
*బ్రత్యానన్లమొనర్చి చూపెదను నాబాహుబలంబొప్పగన్.*

చం: అవును..... ప్రభూ.... అవును.

ముండీ: చూపాల్సిందే ప్రభూ.... చూపాల్సిందే

వీరభ: *అట్టి దురాత్ముతోనెదిరి ఆహావమందున వానితోడుచే*
*పట్టిన బంధుమిత్ర సుతవర్గము నెల్లను నుక్కడంచి నా*
*దిట్టతనంబు సూపి, మనదివ్యపతాకము నెత్తికీర్తి వే*
*బట్టి తిరోగమింతుననివార్య పరాక్రమ విక్రమంబునన్*

చండీ: వీరాధివీర విక్రమోపేత వీరభద్రునకు జయమగు గాక!

ముండీ : చండతరోద్దండ గండరగండ వీరభద్రునకు జయమగుగాక

వీరభ: చండీశ్వర - ముండీశ్వరులారా! మన ప్రమధ గణాదుల నెల్లరావించి, ప్రస్తుత కర్తవ్యమెరింగించి, రణోత్సాహంబు రేకెత్తించవలసియున్నది.

ముండీ: రావించండి - రావించండి ప్రభూ!

చండీ: పిలిపించండి - పిలిపించండి ప్రభూ!

వీరభ: భూతప్రేత పిశాచాదిగణంబులారా?

(భూతాలు - హో......హో.....హో.....)

సీ|| రుధిరమాంసాలతో| క్షు ధనెల్ల నుడిగింతు
తరలిరండోయిభూ| తమ్ములారా...... (హో.....హో.....)
మెత్తనిగుండియల్| మెదడు మీకిప్పింతు
దరియరండోయి ప్రే| తమ్ములార..... (హో....హో.....)
శల్యాంతరాళ మ| జ్జను చీల్చి మీకిత్తు
సాగిరండోపిశా| చమ్ములార! ...... (హో....హో.....)
ధమనులు సిరలును| దండిగాదినిపింతు
శాకినీఢాకినీ| చయములార!

గీ|| లెండు రారండు మీరెల్ల దండుగట్టి
పొండు పొండోరి తండోపతండములుగ
దండనాథ్థుల తుదముట్ట| చెండిచెండి
రండు చెలరేగి మూగుడీ భండనమున.

భూతములు: హో....హో.....హో......హో.......
గండర గండవీరభద్రునకూ.....జై..జై..జై
మండితోద్దండవీరభద్రునకూ.....జై. - జై - జై

వీరభ: చండీశ్వర.... ముండీశ్వరులారా! ఈ త్రిశూలమును మీరిరువురును ఒక్కసారిగా స్పృశింపుడు (ఇద్దరునూతాకుదురు) దీనినుండి యొకమహత్తరశక్తి యుద్భవించి, మీకు మహావీరత్వమొనంగగలదు. ఈక్షణమునుండి వీరాధి వీరులై, విజృంభింపగలరు. ఈ శక్తి మన కర్తవ్యంబునెరవేరు వరకు మిమ్ము కాపాడి, తదుపరియాత్రిశూలమును చేరగలదు.

చం. ముం: (నూతన పరాక్రమవంతులవలెనటింతురు.)

వీరశూరధీరులం| పరేత భూమివాసులం
పరాత్పరున్ మహేశ్వరున్| నిరంతరంభజించెదం
ప్రచండవీర భండనం| బొనర్చి దక్షుద్రుంచెదం
విరించి విష్ణువచ్చినన్| నెదిర్చిగెల్చివచ్చెదం.

(చండీమొండీ ఉత్సాహంతో నెగురుచుందురు.)

వీరభ: ప్రమథగణంబులారా! ఇకనా నిశ్చితాభిప్రాయమునువిని, ధైర్యోత్సాహంబులతో ముందున కురికి, దక్షుని సైన్యంబులనెల్ల చిత్రవధగావింపుడు. నాప్రతి కక్షియైన దక్షుని భవిష్యత్తునేను తేల్చెదను.

సీ|| *భూనభోభాగనం / భూతభూతములెల్ల*
*ఫూత్కారమ· ·ప దూలి / పోవజేతు*
*ప్రళయ ఝంఝానిలా ర్ఘటులపాటవమెల్ల*
*త్రుటిలోన నాశనం / ఘటితపరతు*
*ఉన్నతోన్నత భూధ / రోద్భూత నిర్ఝరీ*
*నీక వాహినుల నందించివైతు*
*ప్రకటితాఖిల ప్రభా / భానమానాగ్ని*
*కీలకుంభించి / శుష్కింవజేతు*

గీ|| *అమరచారణ కిన్నెర / యక్షసిద్ధ*
*గరుడగంధర్వ దనుజ / కిం పురువ నాగ*
*సాధ్యవిద్యాధరుల శల్య / నంధులెదపి*
*నమయజేనెద నాదు దో / స్సారమునను.*

చం: మహామహోగ్రహుతభుగ్జ్వాలావళి నదృశ పరాక్రమోపేత వీరభద్రా! బహుపరాక్.

ముం: కోటిసూర్యప్రకాశ నంకాశ భాసితోత్తుంగ నర్వాంగ వీరభద్రా! బహుపరాక్.

(తెరదించబడును)

చతుర్థాంకము - 1వ రంగము

వీరభద్రుడు చండీశ్వర ముండీశ్వరులతో దక్షయాగంబున కరుదెంచు నమయంబునకు బ్రాహ్మణులు హోమగుండమునకు చుట్టు నుంచబడిన నష్టదిక్పాలకుల పేర్లను మాత్రమే యుచ్చరింపుచు స్వాహాకారములు బలుకుచుందురు.

బ్రాహ్మణ: ఇంద్రాయతూర్పరం అగ్నేయమగ్నిం - నైఋతింనిరుతి యమాదక్షిణం వరుణాపశ్చిమం వాయవ్యం వాయుః - కుబేరా ఉత్తరం, ఈశాన్యం నహి నహి.

వీరభ: (యజ్ఞశాలలో ప్రవేశించి) ఓరీ! పురోహితులారా! దాక్షాయణీ దేవిని దగ్ధమొనర్చిన యీ యజ్ఞము, దక్షుని నిర్యాణముతోగాని పూర్తికాదన్నమాట. హు! ఏమిరా మీదుర్బుద్ధి!

శిక్షార్హుండగు నీ దక్షుడొనంగు తుచ్ఛములగు దక్షిణలకాసించి, బాలచంద్రరేఖాశేఖరుండగు పరమేశ్వరునికే అపచారమొనర్చుచున్నారు. ఎంతటి హేయమైన పని! వేదవేదాంతోపదిష్టంబైన క్రమంబునగాక, దురహంకారముతో,

దూరీకృతధర్మకర్మాచరణులై, పరమేశ్వరప్రతిరూపంబును దూరంబొనర్చి యజ్ఞంబొనర్చుచున్నారా?

ఎవడా ఇంద్రుడు? ఎట్టివాడాయగ్ని? ఎంతటిబలాన్వితుడాయముడు? ఏనాటి ధీరపురుషుడానిఋతి? ఏవిధమున కోవిదుండావరుణుడు? ఎంతమాత్రమధిక సత్తముడావాయువు? ఎవరికంటె విభవసంపన్నుడాకుబేరుడు? ఈయేడ్గురేగాదు. ఇంకేడ్గురైనను పరమేశ్వరు పాదారవిందరజోలేశ సహస్రాంశంబునకైనను సాటిరారే! ఆమాత్రమెరుకలేని బుద్ధిహీనులా యజ్ఞమొనర్చునది.

దక్షుడు: (యజ్ఞశాలకు ప్రవేశించి) ఓరీ! దురహంకారదుర్విదగ్ధా! ఎవడవురా నీవు? నాయాజ్ఞకై నిరీక్షింపకయే యజ్ఞశాల కేతెంచి కారులు ప్రేలుచున్నావే! అనామకుడా! వాకట్టుకొనివాకిలిదాటుము.

చండీ: అనామకుడు గాడుతాతా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన ఆదిశంకరుని కోపాగ్నిలో నుద్భవించిన వీరభద్రేశ్వరుడుతాతా! వీరాధివీరభయంకరుడు.

ముండీ: సకలచరాచరప్రపంచాధి నాథుండైన పరమేశ్వరు జటాగ్రపాతంబున నుద్భవించిన వీరశేఖరుడు తాతా! వీరోచిత సార్వభౌముడు.

దక్షుడు: ఛీ! ముష్టివెధవల్లార - బయటకుదాటి, భట్టుపొగడ్తలతో వీడి నూరేగింపుడు..... పొండు....

వీరభ: తాతా! శాంతచిత్తుడవుకమ్ము. ధర్మాధర్మ నిర్ణేతలగు మీబోంట్లకు చెప్పనవసరములేదనియే భావింతును. తప్పును దప్పుగా నొప్పుకున్నవాడే ధీమంతుడను నార్యోక్తి మీరెరుంగనిదికాదు.

ఉ|| *కాలమొకర్మమో మరియకార్యమునీవలనన్ ఘటిల్లెలో*
*కాలువడంకు చున్నవి యుగ్రవశయంబొకటెప్పుడేని నీ*
*మూలముసన్ జనించునిటు మూర్ఖత శంభునెదుర్కొనంగనే*
*కాలమదెట్టులుండునొాయ గమ్యము తెల్పుగనో ప్రజాపతీ.*

దక్షప్రజాపతీ! సర్వజ్ఞుడైన శంకరుని సామర్థ్యమునీకు దెలియనిదికాదు. మేరుధీరులదూలనాడుట ప్రాజ్ఞుల లక్షణముకాదని నీవే ఒకరికి బోధించువాడవు.

చం|| *శివుడు మహానుభావుడువి శిష్టదపారకృపాబ్ధి వద్మనం*
*భవునకు శౌరికిన్ మిగులు మాన్యత గల్గుమహామహుండు నీ*
*ప్రవిమల కీర్తికిన్ గొడుగుబట్టినయల్లుడమేయుడాతనిన్*
*దివిరివిరోధివై చెడుగుదెచ్చుకొనంగదలంచు టొప్పునే.*

చం|| *భవుడుదలంచుకొన్న ప్రతిభానము పేతులు లక్షలాదిగా*
*బవరము సేయవచ్చెద రపారపరాక్రమ విక్రమాఢ్యులై*
*అవిదితమేమొమీకు నికనైన సదాశివునమ్మి భక్తితో*
*నవినయశాలిగామనుచు సత్కృతిబొందుము నాకమందునన్.*

ఉ|| *ఇప్పటికైన నీవు మనసిచ్చి మహేశుని తోడి సఖ్యమున్*
*తప్పకగోరికొమ్ము పెడదారులు త్రొక్కుదువా సమాప్తమౌ*
*ముప్పదిమూడుకోట్ల సురముఖ్యులు ముజ్జగముల్ దివాకరుం*
*డప్పుడు బేలచందమున ఆర్చిన యేడ్చిన లాభముండునే.*

దక్షుడు: ఓరీ! కుజ్జకుంభా! గ్రుడ్డువచ్చి పిల్లనెక్కిరించినట్లు నాకేబుద్ధులు నేర్పవచ్చితివా? ఈమిడిమేలపు నీతులన్నటినీ యేర్చి, కూర్చి బుద్ధితక్కువవాడైన నీతండ్రికే బోధింపుము - పొమ్ము......

వీరభ: తాతా! సర్వలోకనియామకుండగునా తండ్రియాబుద్ధితక్కువ వాడు?

దక్షుడు: కాదని నిరూపింతువా?

ఉ|| *బుద్ధియొకించుకేని గలవ్వారుమడౌనె శివుండు దివ్యులౌ*
*పెద్దలరాకజూచియును పేర్చు మదాంధత విఱ్ఱవీగుచున్*
*గద్దెవయున్ విరాజిలునె గౌరవమించుక దానెఱింగినన్*
*నుద్దులు వల్కుచుంటి విదినూరిజనంబులొనర్చు చేతయే.*

ఒకవేళ నీబోటి మూర్ఖులను కొంతమందిని బుట్టింపగల శక్తి గలిగి యుండిన యుండునేమో కాని, నిజముగా శంకరుడు ప్రాజ్ఞుడా?

ఉ|| *అంతటి మూర్ఖుడుండునె సురాసురులందున వాడుదప్ప, గో*
*రంతయు తెల్వియుండిన యహర్నిశలట్టుల వల్లకాటిలో|*
*వంతము మైవశించునె, శుభంబులు గూర్చిన నన్ను నైతమా*
*వంతయు లెక్క సేయడు మదాంధుడు శంభుడు బుద్ధిమంతుడే.*

మీముష్కరసంప్రదాయమున నిదినమంజనమేమో కాని, ఆభిజాత్యముగల్గిన మాబోంట్లకిది సహింపరాని తప్పిదము.

వీరభద్ర: తాతా! సర్వజ్ఞుడైన పరమేశ్వరునట్లపార్థము జేసికొన్ననీబుద్ధి పెడతలబట్టిన దాయని యూహింపవలసియున్నది.

శా|| తాతా నీవుదలంచినట్లు, జగదాధారుండు సర్వేశుడే
భాతిందోసమొనర్చునీకు? సమతాభావంబునన్ సర్వలో
కాతీతుండయి యొప్పు నిన్ను నీవాత్మ్యుండుగా నెంచునే
నాతండాత్మ నమస్కరించెనది నీకగ్రాహ్యమయ్యెన్ జుమీ.

దక్షుడు: అర్థమో.... అపార్థమో... అదినా కనవసరము... అల్లుడైనవాడు మామకెదురువచ్చి అర్ఘ్యపాద్యాదులబూజించి, సగౌరవముగా గొనిపోయి, సింహాసనాలంకృతుని జేయవలసియుండ, ప్రజాపతినైన నేను వచ్చికొన్ని గడియలు వేచియుండినను, దొంగసన్యాసివలె కండ్లుమూసికొని కూర్చునియుండుటయా? ఏమిచూచుకొనిరా వానికాటీవి.

ఇల్లున్వాకిలిలేదు గౌరవము నుంతేనిన్ గనంరాదు కో
కొల్లల్ గావు వరిష్ఠసంపద్ధలు వాకోనేల యే పెంపు సొం
పుల్లంబందుదలంచి శంకరుడుదానుప్పొంగి గర్వించెనో
తెల్లంబైకనిపింపరాదు వెడగా తీంద్రింపగానేలరా.

ఇట్లొనర్చినచో నీ తండ్రియు, నీవును, మీవరివారంబెల్లను సుక్షేమంబుగా విముక్తులు కాంబరు? లేదా నీవే ఆలోచించుకొమ్ము.

వీరభద్రుడు: తాతా! ఇంతటి సులభమార్గమెఱింగించినందులకు సర్వదా నీకు మేము కృతజ్ఞులము. మొదట నాతండ్రి యాజ్ఞానువర్తినై వచ్చిన వని పూర్తిగావించి, తదుపరి నీవు జీవించియున్నచో అట్లే మాతండ్రి ని దీసికొనివచ్చి నీపాదములపై బడవైచెద.

దక్షుడు: వాచాలా! నోరుమూయుము. ఏమిటో నీ తండ్రి యాజ్ఞ ? నన్ను వధించిరమ్మనియేగదా.

వీరభద్రుడు: మీరొనర్చిన తప్పులు ఒప్పుకొని, క్షమాభిక్ష వేడికొన్నచో రక్షింపుమనియు, లేనిచో శిక్షింపుమనియు నాతండ్రియాజ్ఞ.

దక్షుడు: తప్పొనర్చినది మీరూ, ఒప్పుకొనవలసినదిమేమా? ఎవడురానికి దుర్బోధచేసినది.

వీరభద్రుడు: తాతా! తొందరపడక, నీవొనర్చిన తప్పులన్నియు వరుసగా లెక్కబెట్టుకొమ్ము.

సీ|| *సకల నిర్జర మౌని | జనసమక్షంబులో*
*ముక్కంటిదూషించు | టొక్కతప్పు*
*యోగనిష్ఠవహించు | భోగిభూషణుజేరి*
*నిక్కిశాపంబిచ్చు | టొక్కతప్పు*
*పరమేశునకు హవి | ర్భాగంబునుంతేని*
*దక్కరాదని పల్కు | టొక్కతప్పు*
*సవనమ్ము వీక్షింప | జను సతీదేవితో*
*ధిక్కారములు పల్కు | టొక్క తప్పు*
గీ|| *ఇట్టి తప్పులు లెక్కకిం | కెన్నికలవొ*
*అన్నియును మంచి తనముతో | నంతమగును*
*కాన నదుపాయమొక్కటి | గలదు నీవు*
*సమ్మతించిన నంతయున్ | చక్కబడును.*

ఆ నదుపాయమేమని యందువా? పరమేశ్వరుని పాదారవిందములపైబడి క్షమాభిక్షవేడికొనుట. అందులకు సమ్మతింతువేని నీకుదోడుగా నేనునువచ్చి, ఆపరమేశ్వరపాదాక్రాంతుడనై, మాతాతను క్షమింపుమని వేడికొందును. మాతామహుడన్న ప్రీతియు, ప్రజాపతియన్న గౌరవము, నన్నుబాధించుటచేతనే నీకీ మాటచెప్పవలసి వచ్చినది. ఇందుకునీ సమాధానమేమి?

దక్షుడు: ఓరీ! అధమాధమా! నీచుడు, నికృష్టుడు - అయిన నీతండ్రి పాదములపై నన్నుపడమనుచున్నావా? ఎంతగుండె నిబ్బరమురా నీకు! ఈ దక్షప్రజాపతి శక్తి సామర్థ్యముల నెఱుంగక మాటాడుచున్నావు.

ఉ|| *లోకములన్ సృజించు కమలోద్భ వుడేననుగన్న తండ్రి యీ*
*లోకములన్నిటిన్ సమవిలోకనజేసి ప్రవృద్ధిజేయు ను*
*శ్లోకుడు నాదు తాత యతిలోక సమర్థుడ నేను దేవతా*
*లోకములెల్లనావి అబలుల్ నను మీరు జయింపనేర్తురే.*

లోకములను మ్రింగిలోకములనే వెళ్ళగ్రక్కుమేమెక్కడ? బిచ్చమెత్తి జీవించుతుచ్ఛులు మీరెక్కడ? కయ్యమునకుగాని వియ్యమునకుగాని సమానత్వముండవలెను.

పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా అన్నట్లు, నీతోయుద్ధముజేయుటకు నేనుకావలెనా? దౌర్భాగ్యుడా! ప్రాణములపై, యాశగలదేని, నాదృష్టికిదూరమగుము... పొమ్ము....

వీరభద్ర : తాతా!

శా|| *తాతాదక్షప్రజాపతీ! తెలిసె నీదౌర్జన్య వాగ్జృంభణల్*
*నాతోనెక్కుడుప్రేలితో తగిన సన్మానంబుగావించినీ*
*తాతన్ తండ్రిని చుట్టపక్కముల పాతాళంబునన్ గ్రుక్కినీ*
*చేతన్ మ్రొక్కులిడంగజేయుదును నాశ్రీకంఠుపాదాలకున్.*

సూర్య: అగు - అగు (అంటూప్రవేశించి) శాపగ్రస్తుడైన శంకరుని పరాక్రమమును గోరంతలు గొండంతలు జేసి,. దక్షప్రజాపతిముందే డంబములు వల్కుచున్న వాక్శూరుడవు ఎవడవురానీవు. తల్లిపుట్టింటిగొప్పదనము మేనమామలయొద్ద పొగడినట్లు, కాటికాపరియైన కరకంఠుని విషయము కార్యశూరులమైన మాయెదుటనా పొగడుట! ప్రజాపతికోపాగ్నికి శలభమవుగాకమునుపే దాటిపొమ్ము.

వీరభద్ర: ఓహో! సత్రయాగంబున ఈ దక్షుని పాటకు తాళము వేసిన సూర్యనామధేయుడవు నీవేనా?

శా|| *ఓరీ! భాస్కరదక్షుపక్షమున నీవాక్కుండవేదో మహా*
*ధీరత్వంబున ప్రేలుచుంటివిట, యేదీ శంభునిర్జించు నీ*
*వీరత్వంబును సాహసంబునిపుడే వీక్షింతు చూపెట్టరా*
*లేదా శూరుడవైన నీ బలిమి కల్మిన్ నే పరీక్షించెదన్*
*ఓరీ ! దక్షాదిత్యులారా!*

ఉ|| *అతడు నీవెకాదు కమలాక్షుడజుండు మహేంద్రుడేగినన్*
*భూతములొక్కటొక్కటియభూత పరాక్రమ విక్రమంబులన్*
*ఘాతుకచర్యలన్ గదిసి గండరగండ ఘన ప్రచండ నాం*
*బోతులుగా జెలంగెదరు పోరున మీరడలెత్తి పర్వగన్*

సూర్యుడు: దక్షప్రజాపతి! ఇది కార్యశూరత్వమో వాక్శూరత్వమో నాకర్థమగుటలేదు.

వీరభద్ర: నీకర్థమగుపద్ధతి వేరేయున్నది... ఓరీ ! చండీశ్వర ముండీశ్వరులారా! యీ యధమాధముని మెడవిరిచి పట్టి పండ్లూడగొట్టిపంపుడు.

(చండీ, ముండీ సూర్యుని బట్టుకొని. లోనికిలాగుకొని పోవుదురు. సూర్యుని లోనవదలి మరలివచ్చి)

చండి,
ముండీ : ప్రభూ! సూర్యుని పండ్లూడ గొట్టిపంపితిమి. తదుపరి కార్యమును మాకాజ్ఞాపింపుడు.

వీరభద్ర: తక్షణమే సైన్యంబును రావించి, పట్టణంబు చుట్టుముట్టించి, అగ్నిహోత్రునకాహుతిగావింపుడు. పొండు.

చం. ముం.: చిత్తం ప్రభూ! (అంటూ తెరలోనికి వెళ్ళి పోవుదురు)

వీరభద్రు: తాతా! దక్షప్రజాపతీ! మృత్యుదేవత భయంకరదంష్ట్రాగ్రంబుల నలగిపోవుకాలము నీకు సమీపించుటచేతనే, దరిద్రులైన శివదూషకుల సాంగత్యంబునీకు సంక్రమించినది.

దక్షుడు: ఓహో! నీవదృష్టదేవతారాధనాతత్పరుడవగుటచేతనే కాబోలు, ముల్లోకముల భిక్షాటనమొనర్చినను, మువ్వూ ఎటలందొక్కపూటకూటికైనా నోచుకోని, మూర్ఖుడైన ముసిముచ్చును తండ్రిగా బడయగల్గితివి.

వీరభద్రు: ఓరీ! అధమాధమా! ఇంతవరకాపరమేశ్వరుని దూషించి ప్రోగుచేసికొన్నపాపాగ్ని చాలక, నిన్ను దహించుకొనుట కింకను ఇంధనములకూర్చుకొనుచున్నావా? నిరంతర శివనిందాలాపములను కఱకు కత్తులమధ్యకుత్తుక నిరికించుకొన్న నీవామూర్ఖడవు - నాతండ్రియా? పుట్టింటి పెట్టుపోతలకాశించి కన్నకూతురు గడపద్రొక్కిరాగా దురహంకారంబున నిష్ఠురోక్తులాడి, ఆమెమృదులహృదయంబును ఛేదపరచి, కడకామె యగ్నికాహుతియగుచుండగా చూచి సహించిన నీవంటి కఠినుడా మూర్ఖుడు, నా తండ్రియా? పంచాననుండైన పరమేశ్వరునితో విరోధించి, కాఱులు ప్రేలుచు గార్దంబంబువోలె గంతులువైచెడి నీవా మూర్ఖుడవు, నాతండ్రియా! నీవే తేల్చుకొమ్ము.

దక్షుడు: ఔనౌను, నీతండ్రిమూర్ఖుడుగాదు. అఘటనాఘటన సమర్థుడు, అనిర్వచనీయమేధావంతుడు. కనుకనే పాత్రాపాత్రములు యోచించి, భస్మాసురునకు వరప్రదానము గావించి, తత్ప్రభావముచే వాడు తఱుముచుండ, ముల్లోకములకు పరుపులెత్తి, కడకు నాపితామహుని పాదాక్రాంతుడై ప్రాణములు దక్కించుకొన్నాడు. అట్టి ప్రభావసంపన్నుండైన నీ తండ్రిసామర్థ్యము నాయెదుటనా ప్రస్తావించుట? ... ఛీ....కుఱ్ఱకుంఖా.

వీరభద్రు: ఓహో! నీతండ్రిమహాయోచనాసంపత్తిగల్గిన వాడగుటచేతనేకాబోలు, తారకాసురునకు వరమొసంగిముల్లోకాలకును ముప్పుతిప్పలు చేకూర్చినాడు. తేపోమాపో ఆతారకుడు మహేంద్రుని పదభ్రష్టునిగావించి, స్వర్గసామ్రాజ్యాధిపత్యమును స్వీకరింపనున్నాడు. అనాడు నీపితృపితామహులు ఎవరి కాళ్ళపై బడవలసివచ్చునోయోచించుకొమ్ము. స్వర్గమర్త్య పాతాళములకు

దాపురించు నిఖిల సంక్షోభములకును కారకులైన, మీ తండ్రి కొడుకులు, లోకకళ్యాణదాయకుడైన మాతండ్రిని వ్రేలెత్తిచూపువారా?

శా|| *నీమూలంబున సర్వలోకములు నగ్నిజ్వాల కాహారమై*
*ఆమూలంబుగ నాశనంబగుట తథ్యంబంచు బృందారకుల్*
*వేమారుల్ శివువేడుచుండిరరుగో విజ్ఞానివై నీవున్*
*సోమేశున్ మది నిల్పి యీప్రళయ సంక్షోభంబు వారింపుమా*

కావున దక్ష ప్రజాపతీ! ఈ మొండి పట్టుచే లోకనిందాస్పదుడవుకాక పరమేశ్వరుని పాదాక్రాంతుడవుగమ్ము. నీమూలమున నెన్నియో ప్రాణంబులు రక్షణపొందగలవు.

దక్షుడు: పోరొనర్పుటకై యేతెంచిన బహుముఖ ప్రజ్ఞావంతుడవు పోరుచాలింపుమని నాకు బోధించు చున్నావా? పిరికిపందా? అట్టిబీరుడవు దివ్యాయుధముగా నొక ఇనుప శలాకనుచేపట్టి పరువెత్తుటెందులకో, ఇచ్చటగలగలలాడు కటకములు ధరించిన సుహాసినులున్నారనియా, తిన్నగావచ్చిన దారినే వెళ్ళి దివ్యాస్త్రధారియైన నీయబ్బనే పంపించు..... అతని కాళ్ళపై నేనుపడవలెనో, నాకాళ్ళపై యాతడేపడవలెనో తేల్చుకొందము...... పొమ్ము.

వీర: ఓరీ! పాపీ ఆశంకరుని సామర్థ్యమును కించపరచిమాటాడితివా, ఇకనీవు బ్రతికిపోలేవు. ఇంతవరకు నాతండ్రి యాజ్ఞాను బద్ధుడనై సామోపాయమునే ప్రయోగించి చూచితిని. కానీ, ఇక దండోపాయము ప్రయోగింపక తప్పనట్లున్నది. కనుకనేయీ విపరీతబుద్ధి పుట్టుచున్నది. ఆపరమేశ్వరుడు నీ వద్దకురావలెనా? పిచ్చివాడా!

శా|| *శైలాగ్రంబున నిల్పి శంకరుడు తా శంఖంబు పూరింపగా*
*నీ లోకాలెల్లపడంకు వార్ధినిచయంబింకున్ భుజంగేంద్రు దృ*
*గ్జ్వాలల్ బొంపిరి వోపవర్వులిడునీసామర్థ్యమాలోలమై*
*కీలాభీలముజెందునంత్యమగు నీభీంకారమప్పట్టునన్.*

కావున మీరాలోచించుకొనియే మాతో యుద్ధమునకు సిద్ధము కండు.

దక్షుడు: ఆలోచింపవలసినదేమియులేదు. మేమందరము సమర్థులమే.

శా|| *మూలాధారులు తాత తండ్రులటునాముమ్మందు నిల్వంగనీ*
*పాలాక్షుండొకడేమిచేయగలడో భావింపుమీదర్పముల్*
*చాలుంజాలు వృథాప్రసంగములు వాచాలా యికన్ నిల్వరా*
*కూళాధీరనగేంద్రుతో తగరుఢీకోజాలునే పోరునన్.*

వీర: ఓరీ! దక్షా! భూలోకాది యూర్ధ్వలోకంబులేడును, అతలవితలపాతాళాది . అధోలోకంబులేడును, ఏకమైమొకరిల్లినను, పరమేశ్వరజటాజూటమునుండి ఉద్భవిల్లిన వీరభద్రుని త్రిశూలఘాతములనుండి మిమ్ము రక్షింపజాలవు.

దక్షుడు: గీ|| *భూతసైన్యంబెగాదు శం | భుండు నేని*

*నందికేశుడెగాదుది | జ్ఞాగమేని*

*భూతపతిగాదు వానిము | త్తాతయేని*

*దక్షునోడింపగలడెయు | ద్ధమ్ములోన*

వీరభ: ఓరీ! పరమేశ్వరపాదరేణువా! నిన్నోడించుటకు ఇంత మందికావలెనా? నేనొక్కడినే నిన్నుక్కడింపగలను. ఈత్రిశూలఘాతంబునకూలనున్నావు, కాచుకొమ్ము.

గీ|| *దక్షనూతి మహాత్వంబు | దనరునేని*

*కాలకంఠుడు నాయందు | గల్గునేని*

*ఈ త్రిశూలంబు శక్తినం | హితయయేని*

*కుటిలుడగు దక్షుదర్పంబు | గూలుగాక!*

దక్షుడు: గీ|| *నాదుజనకుండులోకైక || నాధుడేని*

*బ్రహ్మవంశాననే ప్రజా || పతినియేని*

*కశ్యపాదులకం పెనే || ఘనుడనేని*

*ఈ మహాఖడ్గమితనిఖం || డించుగాక!*

(దక్షుడు ఖడ్గమునెత్తును. వీరభద్రుడు శూలమెత్తును. వీరభద్రుని భయంకరాకృతికి దక్షుడు వెనుకంజవేసినట్లునటించును.) (తెరలోనికిపోవును)

ముండీ: (ప్రవేశించి) చండీశ్వరా! చండీశ్వరా! వీరభద్రేశ్వరుడు దక్షప్రజాపతిని సంహారించివేశాడురా! నీవెక్కడున్నావురా, పరువెత్తు..........

నారదు: (ప్రవేశించి) ముండీశ్వరా! దక్షప్రజాపతి సంహారింపబడెనా?

ముండీ: అవును..... స్వామీ, చనిపోవనున్నాడు. ఆహాఁ చనిపోయేవుంటాడు. అదిసామాన్యమైనయుద్ధమా స్వామీ... వీరభద్రుని త్రిశూలఘాతములకాగజాలక దక్షుడు ఎన్నోసార్లు బ్రహ్మదేవుని, విష్ణుదేవుని వేడుకొన్నాడు. కాని, ఒక్కరైనను కన్నెత్తిచూడలేదు. ఆ మహాతల్లి దాక్షాయణీదేవి కెంతబాధకలిగించెనో, అంతకు రెట్టింపు బాధననుభవించెను.

నారదు: అవును ముండీశ్వరా! అతనిగతి అంతే ! దుర్మార్గులకు ఏదేవుడును సహాయపడడు. ఈనాడు త్రిమూర్తులలో నొకడైన ఈశ్వరునేధిక్కరించినదక్షుడు, రేపు విష్ణుదేవుని మాత్రము ధిక్కరింపకుండునా? మఱునాడు బ్రహ్మదేవుని గతియునంతే. అందుచేతనే వారెవ్వరును సహాయపడలేదు.

## చతుర్థాంకము (2వ రంగము)

(విధ్వంసమైన యజ్ఞశాలావరణము - వీరభద్రుని నిర్వేదము)

వీరభ: పరమేశ్వరా! మేరమీరిన దక్షప్రజాపతియపకీర్తిపాలై అంతిరించెను. నీతో నిర్హేతుకవైరమును దెచ్చిపెట్టుకొని, మోయజాలనంత పాపపంకిలాన్ని ప్రోగుజేసికొనిదానిమూలముగా దుర్మరణము పాలయ్యెను. సర్వవేదసారసంగ్రహుడై, సర్వశాస్త్రపారంగతుడై, సర్వానువర్వకోటికి బోధింపజాలినవాడై, నీతికోవిదుడై, దాక్షాయణీదేవివంటి పవిత్రమూర్తినికన్నవాడై నియమనిష్ఠాగరిష్ఠుడై తపంబొనర్చియు, దేహాభిమానమును వదలుకొనజాలక, దురభిమానదుర్విదగ్ధుడై, నిర్హేతుకముగా నిన్నునిందించి, ఈ ఆపదను కొనితెచ్చుకొనెను.

త్రినేత్రా! త్రిలోకాధిపతివైన నిన్ను, త్రిమూర్తులలో నొకడుగా గుర్తించుటయే యాతనికిష్టము లేకపోయెను. ఈశాన్యాధిపతివైన నిన్నుదొలగించి, యజ్ఞమొనర్చి తనపంతమునెగ్గించుకొనదలంచెను. పరమేశ్వరుడవైన నీకంటెను తానధికుడని ప్రఖ్యాతిపొందుటకై శతవిధముల ప్రయత్నించెను. దేవతలెల్లరు దిగ్భ్రమ జెందునంతగానిన్నుదూలనాడెను. నీపై గలిగిన యీర్ష్యాగ్నితోనే హోమగుండమును రగిల్చెను. దౌర్జన్యమును ఆజ్యముగా బోయుచు దురహంకారపూరితమైన స్వాహాకారములుచ్చరించెను. పరమపావనియైన దాక్షాయణీదేవి అమృతవాక్కుల నపార్థముచేసికొని, యామెనజీవదహనానికి ద్రోహదకారియయ్యెను. అభయంకరదృశ్యమును దలచుకొన్నంతనే నాగుండెలు వ్రీలిపోవుచున్నవి పరమేశ్వరా! నాకు మనశ్శాంతి గలిగించి, నీసన్నిధికిచేర్చుకొనుమయ్యా చంద్రశేఖరా!

(నారదుడు పాట పాడుకుంటూ ప్రవేశించి)

నార: వీరభద్రా! మనోవాంఛాఫలసిద్ధిరస్తు.... ముండీశ్వరా! దక్షయాగసందర్భముగా భోజనాలు బాగాలభించినట్లేనా?

ముండీ: భోజనాలా! మా దాక్షాయణీతల్లి పోయినప్పటినుండి, పచ్చిగంగైనా ముట్టుకుంటే ఒట్టు స్వామీ!

నార: ఇప్పుడుదాక్షాయణీదేవీ కాదయ్యా! పార్వతీదేవీ. దక్షయజ్ఞములో దగ్ధమైన దాక్షాయణీదేవి, బాలికగా హిమవంతుని ఇల్లు చేరినది. అచ్చట దినదిన ప్రవర్ధమానయగుచు పార్వతియనుపేరుతో పర్వతరాజపుత్రికగా బెరుగుచున్నది.

వీరభ: మునీంద్ర! పరమేశ్వరుడిప్పుడెందున్నాడు.

నార: పరమేశ్వరుడా? (కొంచెమాలోచించి) ఆ.... ఆయనగూడ వుండవలసినచోటనేవున్నాడు. అంటే హిమవత్పర్వతసానువులపై తపంబొనర్చుచున్నాడు.

వీర: మఱి, పరమేశ్వరుని నేను దర్శించుమార్గము.

నార: అచ్చటకు వెళ్ళి ప్రార్థించుటయే.

ముండీ: మఱి, మమ్మిప్పుడు ఎవరిసన్నిధానంలో కాలంగడపమంటారుస్వామీ! (ఇంతలో చండీశ్వరుడు ప్రవేశించి నారదునకు నమస్కరించాడు)

నార: (ఆలోచించి) మీరిప్పుడు ఎవరిదగ్గరకు వెళ్ళకూడదు. విష్ణుమూర్తి సన్నిధికిచేరి, ఆయన సేవ చేస్తూకాలంగడపండి, పార్వతీపరమేశ్వరులకళ్యాణం జరిగిన వెంటనే, మరలవారిచెంతకు పోవచ్చు.

చండి-
ముండి: సరేస్వామీ! (నమస్కరిస్తారు)

నారదుడు: వీరభద్రా! నేను దేవేంద్రుని కలిసికొనవలసియున్నది. వస్తాను. (నారదుడు వెళ్ళిపోవును.)

వీరభ: నమస్కారము స్వామీ!

చండి
ముండీ: వీరభద్రేశ్వరా! పరమేశ్వరుని ఆజ్ఞానువర్తులమై నీ చెంతచేరితిమి. మీ ఆజ్ఞల శిరసావహించి దక్షాధ్వర ధ్వంసములో తోడుపడితిమి. మీరు దక్షుని సంహరించి లోక కల్యాణదాయకులైతిరి. ఇకమేము సెలవు తీసుకొంటాము.

వీరభద్రుడు: సరే.... నేనును.... పరమేశ్వరునిచేరుకుంటాను (తెరదించబడును)

దేవేంద్రుడు, బ్రహ్మదేవుడు, విష్ణుదేవుడు ఆసీనులై యుందురు.
తిలోత్తమ నృత్యము సేయును.

విష్ణుదేవు: తిలోత్తమా ! ఏమినీ నటనావైదుష్యము! మేమెన్నడును చవిజూడని వివిధభంగిమల, నీవంపుసొంపులతో మేళవించినర్తించి, మాకమందానందమును చేకూర్చితివి. మాయానందమునకు ఫలముగా ఈ ముత్యాలహారమును గైకొమ్ము.

తిలోత్తమ: మహానుభావా! ధన్యురాలను.

బ్రహ్మ: రంభాద్యప్సరసల కళాచమత్కృతులనధిగమించిన నీనాట్యాభినయమునకు మా అభినందనలు....

దేవేంద్రుడు: సురసేవితా! నీమనోజ్ఞమైన నటనా విశేషము, కమలాక్షకమలోద్భవులను ఎంతయో సంతసింపజేసి, సాటిలేని మహేంద్రుని వైభవాలచాటిచెప్పినది. అందుకు బహూకృతిగా ఈ మణిమాలనందుకొమ్ము.

తిలోత్తమ: దేవాదిదేవులారా! ధన్యురాలను. ఇకసెలవిప్పించినపోయివత్తును.

నారదుడు: (పాటతో ప్రవేశము) పూజనీయులారా! నమోవాకములు.

హరియజులు: నారదా! ఆపీఠమునలంకరింపుము.

విష్ణు: నారదా! ఏవైనా క్రొత్తవిశేషములున్నవా?

బ్రహ్మ: విశేషములేనిదే నారదుని ప్రవేశముండదుగదా! పురుషోత్తమా!

నారదుడు: ఆ...... మీకు తెలియని విశేషములేమున్నవి లెండి! మహేశ్వరునిస్థానమును మహేంద్రుడాక్రమించుట మొదటి విశేషము. మహేంద్రుని స్థానమును తారకుడాక్రమింపనుండుట రెండోవిశేషము. సృష్టి స్థితి కారకులు లోకనాశమును గమనింపకతిలోత్తమనాట్యములో మునిగితేలుట మూడవ విశేషము. ఇంతకంటే విశేషములేమున్నవి మహానుభావులారా!

విష్ణు: మహేంద్రుని స్థానమాక్రమింపగలబలశాలివాడెవ్వడునారదా?

నారదుడు: వాడెవ్వడైనదియు, ఎవరిమూలముగా వాడంతటిబలశాలియైనదియు, మీకు తెలియకపోవచ్చు కాని, మహేంద్రుడైనను తెలిసికొనియుండుట మంచిదని నాయభిప్రాయము. వినండి ముప్వురు వినండి.

సీ|| ఐరావతమ్మునా| కవనరమ్మని చెప్పి
వెడలించుకొని యిక వెడలిపోవు
కామధేనువుపాలు| గావలెనాకంచు
తరలించుకొని కొండ| దాటిపోవు
కల్పవృక్షంబునా| కడనుండవలెనంచు
కుళ్ళగింపగజేసి| వెళ్ళిపోవు
కనకశైలమ్ము శృంగారకేళికి గాగ
చెలువారునంచుతీ| సికొనిపోవు

గీ|| దేవదాసీజనంబును| సేవకొఱకు
నేనుగొనిపోదునంచువూ| నికనుబల్కు
తారకుని దుండగములకుం| దాళలేక
వరుగులెత్తు మహేంద్రుడా| భవునికడకు.

ఇప్పుడునేను చెప్పిన ఘట్టములన్నియు నేడోరేపో వరుసక్రమంగా జరుగుటదప్పదు. అప్పుడు మీకందరకును దెలియకదప్పదు. నేనిక సెలవు దీసుకుంటాను మహేంద్రా!

దేవేంద్రుడు: ఇంతకూ తారకుడను వాడెవ్వడో చెప్పకనేవెళ్ళుదువా నారదా!

నారదుడు: వాడెవ్వడైనదీ.... పరమేష్ఠికి దెలియదా? పురుషోత్తమునకు దెలియదా? నేను చెప్పవలసినదేముంది, మహేంద్రా!

విష్ణు: ఇంతచెప్పినవాడవు అదియు నీవే చెప్పుము.

నారదుడు: ఉ|| ధీరుడుతారకా సురుడు దివ్యబలుండు హిరణ్యగర్భునిం
గూరిచి పెద్దకాలమునకుంఠితనిర్మల భావ దీక్షతో
ఘోరతపంబొనర్చిరణ కోవిదుడెవ్వనిచేతమృత్యువున్
పోరునగల్గుకుండునటు భూరివరంబులునందెవానవా!

అవరప్రభావంబులతో నాతడు జగత్పాలకునేని లెక్కింపక, నిర్భయముగా ముల్లోకములను బాధించుచున్నాడు.

సీ|| వేదవిప్రులనెల్ల వేధించిబాధించి
వింధ్యాటవులదాక| వెళ్ళగొట్టె
సురవర్గములనెల్ల| తరచుగాబంధించి
మున్నిటకసిదీర| ముంచితేల్చె
మానినీరత్నాల| వూనికచెరబట్టి
మానాభిమానాల| మంటగలిపె
తాపసేంద్రులనెల్ల| తలక్రిందుగా గట్టి
ఉయ్యాలజంపాల| లూపుచుండె

గీ|| *యజ్ఞగుండాలలోనన| హవ్యమ్ములైన*
*రక్తమాంసాలవేయించు| రాత్రులందు*
*వర్ణశాలలనివసించు| బ్రహ్మవిదుల*
*దగ్ధమొనరించుదురితుండు| తారకుండు.*

ఆతారకాసురుని దుండగములు క్రమక్రమంగా మేరమీరి వీర విహారమొనర్చుచున్నవి, మధుసూదనా! మీరింట్లు ఇట్లే కొంతకాలముపేక్షించి యూరకుండినచో మహేంద్రుని మహదైశ్వర్యాలు మట్టిపాలుగాక తప్పదు. అమరవర్గమెల్లను నాతనికి అడియేందాసుడనకతప్పదు.

మహేంద్ర: నిజమా! నారదా!

నారదుడు: కాక... అబద్ధమా!

విష్ణుదేవు: బ్రహ్మమానసపుత్రుడైన నారదుడు అబద్ధమాడునా? మహేంద్రా!

నారదుడు: ఆ.... ఆ..... నేను బ్రహ్మమానసపుత్రుడను. బ్రహ్మదేవుడు మీమానసపుత్రుడు. అయినను అహల్యాజారునకు అనుమానమనుమానమే. కాకపోయినచో సృష్టి స్థితి కారకులైన మీరు యీసమయంలో తిలోత్తమనాట్యావలోకనానంద తరంగాలనోలలాడుదురా?

బ్రహ్మ: ఏమినారదా! ... అట్లనుచుంటివి.

నారదుడు: పితృదేవా! పితామహా!

ఉ|| *మీరును, మీరు లోకులకు మేలొనరింప సమర్థులయ్యు నా*
*కారణమేమొగాని వలుగాకులదుండగమోర్చినార లే*
*దారియులేక భక్తవరదా! యని భక్తులు మిమ్ము వేడివే*
*సారుచనున్నవారలిటు శంకరుడైన నుపేక్షసేయునే.*

విష్ణు: నారదా! దేనికైనను సమయమానన్నముగావలెనుగదా!

తే.గీ|| *దురితుడొనరించునట్టివిద్రోహచర్య*
*లావుటకుగానివానితో| నతిశయించి*
*పోరుసాగించివానిచం| పుటకు గాని,*
*సమయమొదవకయత్నమ్ము| చక్కబడునె?*

బ్రహ్మ: నారదా!

గీ|| *తారకుడునన్ను మెప్పించ| దవమొనర్చి*
*రాజిలుచునుండె మేటివ| రమ్ములంది*
*విషఫలమ్ములనిడునట్టి| వృక్షమైన*
*ద్రుమంపజాలునే పెంచిన| దోహదుండు*

నారదుడు: విరించి - విష్ణుదేవులారా! సర్వసంగపరిత్యాగినైన నాకెందుకయ్యా ! ఈగొడవ.... తారకాసురుడు సర్వసైన్యసమేతుడై మహేంద్రుని మీద విజృంభించి నప్పుడే, యాతడు మిమ్ము వేడుకొనగలడు. అప్పుడే అసమస్యతీరిపోగలదు. చేతులుకాలినగాని, ఆకులు పట్టుకొనరు. ఈ నాడు మిమ్ము మేల్కొలుపవలసిన అవసరము నాకేల... వస్తా... (నారదుడులేవబోవును)

మహేంద్ర: నారదా ! ఆవేశపడకయ్యా ! నీవుచెప్పదలచిన విషయమేదో సాంగోపాంగముగా వివరింపుము. మేముదానిని దప్పకపాటింతుము.

నారదుడు: మహేంద్రా.

గీ|| *శంకరుడు."లయ" కర్మకున్| స్వస్తి జెప్పి*
*యోగమార్గమ్ము బట్టెవి| యోగియయ్యె*
*అకతంబున జీవుల| త్యధికమయ్యె*
*పాపభారమ్ము తీవ్రమై| బరగెనేడు.*

అది కారణంబుగా భూదేవి హృదయవిదారకముగా విలపించుచున్నది. సాధులబాధలు చెప్పనలవిగాకున్నవి.

విష్ణు: నారదా! ముఖ్యముగా నీవు వచించునది తారకాసురుని సంహారమును గురించియేకదా!

నారదుడు : కాదు... కాదు... ఆతారకాసురునడంపగలమహావీరుడుద్భవించుటకై, అమహనీయ దంపతులకళ్యాణము జరుగుటకై, లోక కల్యాణమొదవించుటకై నాయుద్యోగాధ.

విష్ణు: మహనీయదంపతులా? వారెవరు నారదా!

నార: ఓహో!వారెవ్వరైనదియు నీకెఱుకలేనిచో, నేనేమి చెప్పగలను పితామహా.

దేవేం: తెలియనిది తెలియ జెప్పుటయేగదా! నారదా! నీ విధి.

గీ|| *ఎవ్వరేకార్య భారమం| దెనగుచున్న*
*నీవు మాత్రము నైకైక| నియతితోడ*
*నరయుచుందువులోకక| ల్యాణ పథము*
*మాన్యబుధవర్యనారద| మౌనివర్య*

విష్ణు: ఆచరించవలసిన విధానమేది, అవశ్యమెఱిగించునారదా.

నార: అట్లయిన సావధానచిత్తులై ఆకర్ణింపుడు. దక్షాధ్వర సందర్భముగా దగ్ధమైన దాక్షాయణీదేవి బాలికగారూపొంది వియన్మార్గమున హిమవంతుని ఇల్లుచేరినది. అచ్చట పార్వతియను పేరుతో ప్రవర్ధమానమగుచున్నది. దాక్షాయణీదేవీ వియోగకారణముగా పరమేశ్వరుడు వైరాగ్యమూని, హిమాలయ పర్వత సానువులందే తపమాచరించుచున్నాడు. అపార్వతీపరమేశ్వరుల సమాగమమేర్పడినపుడే లోక కళ్యాణము జరుగగలదు.

బ్రహ్మ: తపోనిష్ఠాగరిష్ఠుడైయున్న పరమేశ్వరునితో పార్వతి ససుసంధించుట సామాన్యమైన పనియా నారదా!

మహేంద్ర: అదియేనాకును సందేహము నారదా!

విష్ణు: కమలాసన, వాసవులారా! మీరెందులకయ్యా తొందరపడుట. అందుకు సరియైన మార్గమును నారదుడే చూపింపగలడు.

నార: పురుషోత్తమా! ప్రస్తుతము పార్వతి హిమవంతుని ఆదేశానుసారముగా, సాక్షాత్పరమేశ్వరునే పూజించుచున్నది. ప్రతిదినము ప్రాతఃకాలముననే పరమేశ్వరుని ఆశ్రమమునకు వెళ్ళి యోగనిష్ఠలోనున్న శంకరుని ఆరాధించుచుండును.

వారిమానసక్షేత్రములరాగోదయమగుటకై మన్మథ బాణప్రయోగము జరుగవలసియున్నది. కావున యీకార్యభారమంతయు మన్మథుని భుజస్కంధములపై యున్నది. అతనిని నియోగించు భారము మీపై యున్నది.

విష్ణు: మహేంద్రా! విన్నావుగదా నారదుని వాక్కులు. పరమేశ్వరుని కల్యాణము నీచేతి మీదుగా జరుగవలసినట్లున్నది.

మహేం: పురుషోత్తమా ! త్రిమూర్తులలో నొకడైన పరమేశ్వరుని వైరాగ్యమునుండి మరల్చి పార్వతీదేవి పై ప్రేమానురాగములు కల్గునట్లుగా నొనర్చుటకు, మన్మథునకైనను సాధ్యపడు విషయముకాదు. అందుకనువైన మార్గము నెఱింగించుటకు నారదమహర్షియే సమర్థుడు. ఈలోక కల్యాణదాయకమగు కార్యము ఆయన వల్లనే నెరవేరవలసియున్నది.

బ్రహ్మ,విష్ణు,: సరే ! సరే! నారదా! అందులకు మేము సర్వదా సంసిద్ధులుగా
మహే: నేయుందుము.

నార: సరే... నేను సెలవు తీసికొంటాను. (తెరదించబడును)

## చతుర్థాంకము 3 వ రంగము

(రతీమన్మథుల ప్రవేశము)

(రతీ మన్మథులు: యుగళ గీతము పాడుకొంటూ ప్రవేశించిరి - రతీదేవి తన నాట్యచాతుర్యమును చూపుచు నర్తించును)

మన్మ: రతీ! ఈ ప్రకృతిరామణీయము చూడ చూడ నాకేదో తన్మయత్వముగల్గుచున్నది. మేఘావృతమైన ప్రకృతి క్రొత్త శోభను నంతరించుకొని, ఎంతముగ్ధమోహనముగా కనిపించుచున్నది.?

సీ|| *కాబోలు పర్వతాగ్రములకారు మొయిళ్ళు*
*మత్తేభములు మాడ్కిమసలుచుండె*
*కాబోలు చమరీమృ| గాల తండముశైల*
*సానువుల వుండి రా| సాగుచుండె*
*కాబోలు నదిమహా |గంభీర నరస్సిహం*
*నలనమూహోలు భా| సిలుచునుండె*
*కాబోలు నదిదేవకామినుల్| విహరించు*
*నందనోద్యానమిం| పొందుచుండె*

గీ|| *అదియెకాబోలు మాధుర్య| మతిశయించి*
*వంశనాళమ్ము నుండి వె| ల్వ డెడుపాట*
*అదియెకాబోలు పొదరిండ్ల| నలరుదేనె*
*లారగించెడి పుష్పంద| యాలరవళి.*

రతి : నాధా! వసంతుడీరీతి ప్రకృతినిశోభింపజేసి నీకెంతయో సహకారియగుచున్నాడు.

మన్మ : రతీ! వసంతుని సహకారము కంటే నీసహాయమే నావిధినిర్వహణకు మిక్కిలి దోహదకారియగుచున్నది.

రతీ : ఓహో! ఇదియునొకవిధమైన లాలనయేనా?

మన్మ : కాదురతీ! యదార్థమే చెప్పుచున్నాను. నీతోప్రణయ లీలా సౌధోపరిభాగంబుల నేను పొందు గాఢ పరిష్వంగానుభవము చేతనే స్త్రీ పురుషులు ప్రణయఘట్టములను చక్కగా రూపొందించ గలుగుచున్నారు.

రతీ : కావచ్చును... కానీ, అందుగొప్పతనమేముంది ప్రభూ!

మన్మ : రతీ! కుసుమరాజము తనలోని అద్వితీయ సౌరభాన్నితాను గ్రహింపజాలదు. జుంటితేనియ తనలోని మాధుర్యాన్నితాను అనుభవింపజాలదు. అట్లే నీ సౌందర్యప్రాభవాన్ని నీవు గుర్తింవజాలవు. నా హృదయచంచరీకమెల్లప్పుడును దానినాస్వాదించి తనివొందుచుండును. కావుననే ప్రకృతి యందు పురుషజన్మసాఫల్యతకు స్త్రీ మూర్తియే కడుంగడుదోహద కారియగుచుండును.

గీ|| *అదిగో అల్లదుచూడుమా! అడులేడి*
*చెంతమగలేడికూర్చుండి! చెఱకుదంట్లు*
*నోటికందించునట్టివి! నూత్నభావ*
*చేష్టలంజూపులాలనన్! చిగురుబోడి.*

మన్మ : ప్రేయసీ! ఇందులకేమని యెదవు?

రతీ : ఇది ప్రకృతి స్వాభావికమేయందును.

మన్మ : స్వాభావికమేకాదురతీ! సృష్టికిమూలముగూడ అదియే. ఆ విధానముకుంటువడకుండా చూచుచుండుటయే నా విధి.

రతీ : మీ విధిమీరు నిర్వర్తింవకున్నచో - వియోగము ప్రాప్తించునా?

మన్మ : ఏ స్త్రీ పురుష సంయోగమైనను నా పుష్పబాణము తాకనిదే వర్ధిల్లజాలదు. ఆ బాణహతికిదోహదకారులే ఈ మందమారుతములు, తుమ్మెదరొదలు, కోకిలారావములు, సెలయేటి ప్రవాహములు, ఋతుప్రభావములు.

రతీ : అవునుప్రభూ! ప్రకృతి యందు ప్రతియొక్కటియు ఆ విశ్వరూపునియాజ్ఞ ప్రకారము తనవిధితాను నిర్వర్తించుచుండును.

మన్మ : అవును దేవీ! ప్రకృతియందు ప్రతియొక్కటియు తనవిధితాను నిర్వర్తింపుచు, సృష్టికి సహాయభూతమగుచుండును. ఇదియే సృష్టిరహస్యము.

నార : (పాటపాడకుంటూ ప్రవేశము)

రతీ : దేవమునీంద్రా! నమస్కృతులు.

నార : ప్రణయదంపతులకు కళ్యాణమస్తు.

నార : (కూర్చునుచు) మదనా! అదృష్టమన్న నీదేనయ్యా. లేకపోయినచో త్రిలోక కల్యాణదాయకమైన మహాకార్యమునకు పాకశాసనుడునిన్నే

నియోగించునా? దేవతలలో ఘటనాఘటన సమర్థులున్నారే? మఱి, ఆ యశోరత్నకిరీటము నీవు ధరింపవలెననియే ఆతనికోరిక కాబోలు.

రతీ : ఏమిటి ఋషీంద్రా! ఆ మహాకార్యము.

నార : ఉన్నదమ్మా! ఉన్నది. ఈ క్లిష్టసమయమున శృంగారపురుషుడైన నీనాధుడొనర్పవలసిన మహాకార్యమదియొక్కటియే! రతీదేవీ!

మన్మ : ఏమిటి మునీంద్రా! అసలు విషయమెరిగింపకయే దానిని గూర్చి వ్యాఖ్యానించుచున్నారు.

నార : ఎరిగించుటకేగదయ్యా మదనా! ఇంతదూరము శ్రమపడి, ఆదేవేంద్రుని మాటమోసికొని నీ వద్దకువచ్చినది. ఇదిగో... చూడు... ఒక్కప్రశ్న.

రతీ : ఒక్కటేమిటిమునీంద్రా! పదిప్రశ్నలడుగుడు. తెలిసినంతవరకు సమాధానమివ్వగలము.

నార : అమ్మా! రతీదేవీ! పరమేశ్వరుడిప్పుడెక్కడున్నాడోమీకు... తెలియునా?

రతీ : తన నివాసస్థానమైన కైలాసమున లేడా?

నార : (విచారగ్రస్తుడగు నటన)

మన్మ : మరి.... ఎక్కడున్నట్లు?

నార : తానెక్కడున్నను, తనవిధినిర్వహణలనిమగ్నుడైయుండినచో యింతటిబెడదవచ్చియుండెడిది కాదుమదనా?

మన్మ : ఇంతకూ వచ్చిన బెడదయేమిటో తెలుపకనే....

నార : అది, అంతసులభమైనదికాదుమదనా! బ్రహ్మేంద్రాదులకు సైతము ముందు వెనుకలు దోచక, సతమతమైనన్ను పిలిపించుకొని, నాకెరింగించిరి. నేను నీతో ప్రస్తావించి, తదుపరిమార్గమెరిగించెదనని చెప్పివచ్చితిని.

రతీ : ఇంతకును... ఆరహస్యమేమిటో.... తెలుపకనే....

నార : ఆ.... రహస్యమేముందమ్మా! త్రిలోకములందెచ్చట యేదంపతులు అన్యోన్యానురాగ తరంగడోలికల తేలియాడుచున్నారన్నచో.... అదిమీచేతి చలువయేగదా తల్లీ.

రతీ : అవునునారదా! నా నాధుని కర్తవ్యమే అదికదా!

నార : మరీ! విడివడిన దంపతుల కలుపుటయు నీనాధుని కర్తవ్యమే గదా!

మన్మ : అవును మునీంద్రా! మేమెప్పుడును స్త్రీపురుషుల కలయిక నేకోరుచుందుము. అరీతిగనే సృష్టికార్యమునకు దోహదమొనరంగుచుందుము.

నారద : నాకు తెలియనిదేముంది? మదనా! నీవెప్పుడును లోకకళ్యాణార్థమైపాటుపడుచుందువు. అందులకు నీ ధర్మపత్నియు సహకారమందించుచుండును.

రతీ : ఇంతకూ.... ఆ విడివడిన దంపతులెవ్వరో....

మన్మ : అంటే.... సతీ.... శంకరులా?

నారద : అవునుమదనా, అవును, వారిసమాగమమేదేవతలయాకాంక్ష. అది జరుగకపోయెనా? మహేంద్రుడు పదభ్రష్టుడే. అనుయాయులైన మీరందఱుకాలికి బుద్ధిచెప్పవలసినవారే.

రతీ : ఏమిటి మునీంద్రా? పోనుపోను మీమాటలు భయంకరములగుచున్నవి.

నారద : అవునమ్మా! బ్రహ్మదేవుని మెప్పించి వరములు సంపాదించిన తారకాసురుని విజృంభణలు తరతమములు దాటి తారస్థాయినందుకొన్నవి. ఏసమయమున దానవులు చెలరేగి, స్వర్గాధిపత్యమును చేజిక్కించుకొందురోయన్న భయముచేత మహేంద్రుడు ప్రాణములరచేతబట్టుకొని, పానకముద్రాగుచున్నాడు.

మన్మ : సతీశంకరులసమాగమమునకు, తారకాసురుని విజృంభణకు సంబంధమెక్కడనారదా!

నారద : అదియే మీరు తెలిసికొనవలసిన రహస్యము. పార్వతీ పరమేశ్వరుల కలయిక చేతనొక మహాపురుషుడుద్భవింపగలడు. అతనిచేతిలో తారకుడు చావగలడు. ఇతడుతప్ప మరెవ్వరును తారకుని సడంపజాలరు. ఇది బ్రహ్మదేవుడిచ్చిన వరప్రభావము.

మన్మ : ఇంతకును పరమేశ్వరుడెచ్చటనున్నాడు? ఏమిచేయుచున్నాడు? సతీదేవి యెచ్చటనున్నది? వీరి కలయికయెట్లు?

నారద : సతీదేవి మూడవయవతారమున పార్వతీదేవిగా హిమవంతునింట పెరుగుచున్నది. అచ్చటికిచేరువలోనే పరమేశ్వరుడు తపంబొనర్చుచున్నాడు. ప్రతిదినము పార్వతీదేవి పరమేశ్వరుని పూజించిపోవుచుండును. ఆసమయమును గుర్తించి, ఆదిదంపతుల హృదయక్షేత్రమున ప్రేమబీజము ఉత్పన్నముచేయుటయే నీ కర్తవ్యము.

మన్మ : మునీంద్రా!

ఉ|| నాకిదిసాధ్యమౌనె మునినాథ! మహోగ్రుడు శూలపాణిపై
దాక ప్రసూన బాణములు తార్కొనజేతునె పార్వతీహృదిన్
ప్రాకగ జేయగల్గుదునె భావవికారవిలోలవిభ్రమల్
నాకమునేలు నాదివిజనాథుడు నన్నెఱజేయబూనెనే.

నార : మనోజా!

ఉ|| కాదనరాదు దీనిని సుఖంబులుగూర్చు మహేంద్రునాజ్ఞ పో
రాదనరాదులోకములు రంజిలశంకరునంతరాత్మ రా
గోదయమందు కార్యమదియోడినగెల్చిన మాన్యకీర్తి నం
పాదకుడౌదువోయి యనుమానమికేల రతీ మనోహరా!

మన్మ : (కొంచెమాలోచించి)..... సరే! కానిమ్ము మునీంద్రా!

"పరోపకారార్థ మిదం శరీరం" అని గదా పెద్దలు చెపుదురు. మూడు లోకాల సంక్షేమమునకై యీ తనువును త్యాగము చేయుచున్నాను. నేనిపుడే పరమేశ్వరుని తపోవనమున కేగెద. రతీ! నీవును నాతో రమ్ము. పరమేశ్వరుని కరుణా కటాక్షములెట్లుండునో.

రతీ: అటులనే ప్రభూ!

నారదు: మదనా! నీకు శుభం బగుగాక! నేను మహేంద్రుని వద్దకెళ్ళి కమలాక్ష కమలోద్భవుల సమక్షమున నీ వర్తమానమెరింగించెద.

(తెరదించబడును)

## చతుర్థాంకము – 4 వ రంగము

మన్మధుడు : (ప్రవేశించి - తనలో) పరమేశ్వరా! కమలాక్ష, కమలోద్భవుల యాజ్ఞను శిరసావహించి నేనీ కార్యమునకు బూనుకొంటిని. ఇది నీ తపోభంగమునకు కారణమైనదైనను, త్రిలోక సంక్షేమకరమైనదగుటచేతనే నేను దీని కియ్యకొంటిని. ఈ కారణమున నేనేమైనను ఆది దంపతులనురాగమూర్తులై యఖిల లోకముల కాపాడుదురనియే నాయాశయము. పూముల్కుల మీపై ప్రయోగింప సాహసించినందులకు క్షమింపుడు.

(ఈశ్వరుడు యోగనిష్ఠలోనుండును)

ార్వతి : (ప్రవేశించి, పూలతో పూజించుచు పాట పాడుచుండును. మన్మధుడు ఆమెపైనొక పూబాణమును ప్రయోగించును)

పరమేశ్వరా! మీ యాజ్ఞను బొందియే నేను హిమవంతుని కూతురనైతిని. నాటి నుండి నేటి వరకు మీకు దూరస్థురాలనై పరితపించుచు, మీ కరుణామృతమునకెదురు చూచుచుంటిని. పరమేశ్వరా! ఈ దీనురాలిపై మీ దయామృత వృష్టినెపుడు కురిపింతువో, ఎపుడు నా హృదయపుండరీకముత్ఫుల్లమై ప్రకాశించునో, ఆ ఆమనికోనమే యెదురు చూచుచున్నదాన మహాదేవా!

ార్వతి : (లేచినిలుచుండి) పరమేశ్వరా నేను ప్రకృతిని, మీరుపురుషులు ప్రకృతిపురుషసంయోగమే పాంచభౌతికప్రపంచోత్పత్తికి ప్రేరణయగును. ... మనవలన నుత్పత్తియగు యీ ప్రకృతి విలాసమే, నన్నిపుడు భ్రమింపజేయుచు, నాస్థైర్యమును సైతము చలింపజేయుచున్నది. ఈనాడే కారణముననో, నాతనువు నాయదుపు దప్పి చరింపను త్సహించుచున్నది.

అహా! ఏమియీమలయమారుత మందగమనము. మందమందమారుతానీతపుష్ప సౌరభసమన్వితపూ దేనియలంగ్రోలనేతెంచు షట్పదఝుంకారము. ఝుంకార మందరంబును తారస్థాయికిజేర్చిన కోకిలారావములు, కోకిలారావంబులకు మైమరచిన శుకశారికలకూజితంబులును, కూజితంబులననుసరించి లయబద్ధముగా ప్రవహించు సెలయేరులును, సెలయేటినీటితుంపురుల వలన హెచ్చిన ఉత్సుకతతో మైమరచినర్తించు మయూరంబులును, నాహృదయమునకేదో మత్తెక్కించి, నాస్థైర్యంబును, ధైర్యంబును చలింపజేయుచున్నవే!

మహాదేవా! ఇటుచూడు! (యోగనిష్ఠాగరిష్ఠుడైన శివునివంకజూచి, పెదవిగరచి) అరవిందమరందమును గ్రోలుచున్నమగతేటి ఝుంకారమున నాడుతేటిని తన చెంతకాహ్వానించుచున్నది. రాగరంజితమైన మావిచిగుళ్ళను మెసవుచు, పుంస్కోకిల పంచమస్వరము నాలాపించుచు తనప్రాణప్రియకెదురేగుచున్నది. సంతసంబునలేడిలేమ గంతులు వేయుచు తన ప్రియకాంతుని చేరబోవుచున్నది. నామనంబెందుకో ఊయలలూగుచున్నది.

మహేశ్వరా! వసంతశోభానముపేతంబుగునా ప్రకృతితో ప్రాణికోటి లీలావిలాసంబుల నవలోకించుచుండ, నాహృదయ వీణాతంత్రులు తమంతటవే రాగాలాపనచేయుచున్నవి. చిరకాలవియోగవేదనాభరితమైన నాయెడదపై యీప్రకృతి

ప్రభావమంతకంతకు బలీయమైనన్ను డోలాయమానమానసగా నొనర్చుచున్నది. ఈ విధముగా నెంతకాలము నన్ను పరీక్షింప నెంచితివిదేవా! ( మన్మథుడు మరల ఈశ్వరునిపై బాణప్రయోగము చేయును)

ఈశ్వ : (కన్నులు తెరచి) దాక్షాయణీ! కాదు... కాదు... పార్వతీ! నేడేమి సకల పురంధ్రీజనసౌందర్యమెల్ల నీయందే రాశిబోసినట్లున్నది? అహా! యేమి నీముఖారవింద ముగ్ధమోహన శోభావిర్భావము. షోడశకళాప్రపూర్ణుడైన చంద్రునిజూచి భ్రమించుచున్నానా? అహా! యేమి యాబింబాధరమధురసుందరము. కామినీ! మత్తగజగామినీ! నీమధురోక్తుల మరలనొక్కసారియుచ్చరింపుము. కుటిలకుంతలా! నీ మందహాసమాధుర్యాన్ని ఒక్కసారి గ్రోలనిమ్ము. పార్వతీ! ధవళకాంతులతో శోభిల్లుచున్న యవిదాడిమబీజములా? లేకదంతములా? నన్నేయింతయాకర్షించుచున్నవి. మోహనాంగీ! కొంచెమటునిలుచుండి నీ మనోహరాకృతినొక్కసారి తనివితీర దర్శింపనిమ్ము (అంటూలేచి నిలుచుండును)

పార్వ : (సంభ్రమాశ్చర్యములతో దిక్కులు చూచుచుండును)

ఈశ్వ : ఓహో! అవి, అరవిందమరందమును గ్రోలుటకై పరిభ్రమించుచున్నమత్తమధుకర సముదాయమా! కాదే! నీలమణి ప్రభూతపుంజముల బోలుకుటిలకుంతలములా!..... అహా! యేమిది? పార్వతీ! నేడు త్రిజగన్మోహినివైపొడగట్టుచున్నావే! నన్నేముగ్ధుని చేసి మోహావార్ధిలో ముంచుచున్నావే! అహా! యేమియాకనుబొమలతీరు, అవికనుబొమలా? లేకమన్మథశరాసనములా? (అంటూ ఆశ్చర్యముతో చూచును) (మన్మథుడు కనిపించును. పార్వతి లోనికి వెళ్ళును) (ఈశ్వరుడు కోపోద్రిక్తుడైవున్నటులుండి) ఓరీ! దురహంకారీ! నాయీమనస్సంచలనమునకు కారకుడవునీవా! తరతమభేదరహితంబుగా, కామినీకాముకులపై బ్రయోగించు నీకుసుమాస్త్రముల నాపైని సైతము ప్రయోగించితివా? "వినాశకాలే విపరీతబుద్ధియన్నట్లు" నీవలె మేరమీరి ప్రవర్తించిన గర్వాంధులెల్లరు ఈ పరమేశ్వరుని కంటిమంటకాహుతియైపోయిరి. నీవును వారిలో చేరిపోవుదువుగాక.

*ఓరీ మన్మథ దుర్విదగ్ధ! నిజగర్వోన్మత్తమాతంగ సం*
*చార ప్రక్రియనేజెలంగి నను నీ చాపంబుతో నొంపగా*
*ధీరత్వంబువహించినాడవటురాతీశాన్ భవత్కాలమీ*
*ఘోరాగ్ని ప్రభలీనుచూడ్కి తెరయైకూలంగదే భస్మమై.*

మన్మ : హా! పరమేశ్వరా! పాహిమాం - పాహిమాం...

రతీ : నాథా! నామనోనాథా! జగన్నాథునికంటిమంట కాహుతియై పోయితివా! ఏపాపమెఱుగనినీపై పరమేశ్వరుని కోపాగ్నిజ్వాలలు

యతించిన సత్కార్యోద్యమము.

మహానుభావా! జగత్కల్యాణ నందాయకుడైన కంజాక్షునాజ్ఞానువర్తియై నా పతి నీకడకేతించి అలరుటమ్ముల నీపై ప్రయోగించెనేగాని, బుద్ధిపూర్వకముగా నీపని తానొనర్చినదికాదే! పరమేశ్వరా! యేపాపమెరుగని నానాథుని భస్మంబొనర్చివిరించినసృష్టికార్యంబును నిరోధింపజూచితివాదేవదేవా! దయాసాగరా! నాకు పతిభిక్షపెట్టి, నాహృదయావేదనచల్లార్పవలసినవాడవు నీవు దక్కనింకెవరు మహేశా!

రతీ : చం|| *జగములనుద్ధరింప, వనజాననవానవముఖ్యులెల్లర*
*య్యగణితసౌఖ్యసాగర విహారమొనర్పగ నుర్వివధ్యులా*
*వగతురనుక్కడంప నిజభక్తవరేణ్యులచిత్తవీధినె*
*వ్వగలుడుపంగ నీవెదగువాడవు దైవశిఖామణీ శివా!*

(రతీదేవి ఈశ్వరుని పాదములపై బడును)

ఈశ్వ : (యోగదృష్టిని మరల్చుకొని) రతీదేవీ! లెమ్ము.... జరిగిపోయిన కార్యకారణమేదియో నేను గ్రహించితిని. నీనాథుని నజీవునిచేయుమనియే, బ్రహ్మవిష్ణు మహేంద్రాదులు నన్ను ప్రార్థించుచున్నారు. నిరపరాధియైన నీభర్త తక్షణమే పునర్జీవితుడుకాగలడు. కానీ, ఇదిమొదలు నీ భర్త యొక్క స్వరూపము నీకుదక్కమరెవ్వరికినిగాన్పింపదు. కలకాలము మీదాంపత్యము వర్థిల్లుగాక! కందర్పా! పునర్జీవితుడవైలేచిరమ్ము.

(మన్మధుడు వెంటనే లేచివచ్చి, శివుని కాళ్ళపైబడును)

ఈశ్వ : కందర్పా! నీవేకార్యమును సాధింపనాపై పూవుటమ్ముల ప్రయోగించితివో, దాని ప్రయోజనమెద్ధియో నాకర్థమైనది. ప్రస్తుతము సురసైన్యాధిపతి కాగలుగు మహాసత్వసంపన్ను డొకడుద్భవింపవలెననియే గదా సురపుంగవులకోర్కె....

మన్మ : అవును మహాదేవా!

ఈశ్వ : మీ మనోరథంబులీడేరుగాక! నేనిప్పుడేపోయి హిమవంతునకుకుమార్తెగా బెరుగుచున్నదాక్షాయణిని చేపట్టి మీ కోర్కె లీడెర ప్రయత్నించెద. నిన్నీకార్యంబునకు నియోగించిన బ్రహ్మేంద్రాదుల కీవర్తమానమెరింగింపుము.

రతీ-మన్మ : పరమేశ్వరా! మాకిక సెలవా!

ఈశ్వ : పోయిరండు.

రతీ-మన్మ: (వెళ్ళిపోవుదురు)

ఈశ్వ : (స్వగతము) దగ్ధమైపోయిన దాక్షాయణీదేవి, పర్వతరాజపుత్రికగారూపొంది, పార్వతి యను పేరున ప్రవర్ధమానమగుచు, నానమాగమమునకై, నన్నుగూర్చి ఘోరతపంబొనర్చుచున్నది. ఇక కాలయాపనచేయక, నేదో యొకమాయవేషంబున నామె గుణశీలములు పరీక్షించెద. అందులకు తగినట్టిది ఎరుకలసానివేషము. అవేషమును ధరించిపోయి అమెనెల్ల విధముల పరీక్షించెద.

## పంచమాంకము

### 1వ రంగము - (ఎరుకలసాని ప్రవేశము)

సింగి : (ప్రవేశించి) - ఎరుక - ఎరుకోయమ్మ - ఎరుకమ్మ ... ఎరుక

ఎరుకజెపతాదుండి - ఎరుకజెపతాను

ముందు ఎనకలు జెపతా - మూలమ్మజెపతా

మొదలెత్తుకొనిదాని - తుదకు జెపతాను

ఎందరెందరొనన్ను - ఎరుకడిగినారు

గొప్పగొప్పోళ్ళకు - మెప్పుజెప్పాను

మనసులోదలసిన - మాటజెపతాను

మనిసిని జూత్తెనె - మరుగు జెపతాను

అరచేతిలోరేక - లన్ని జెపతాను

పుట్టుమచ్చలజూచి - గుట్టుజెపతాను

ఆడమగ వినయాలు - అన్నిజెపతాను

ఎరుకంటె యీనాటి - ఎరుకకాదమ్మ

ముందు జన్మలయెరుక - నేనెరుగుదమ్మ

అందులో మరమాలు - అడగందెజెపతా

సింగి జెప్పేమాట - సిసలైన మాట

ఓళ్ళ సామె.... ఎరకడగరమ్మ - ఎరుకడగరమ్మ - ఎరుక - ఎరుకో ఎరుక - ఎరుకమ్మ - ఎరుక.

నారదుడు : (ప్రవేశించి, స్వగతముగా) భువన మాయా తమస్సున కావల లీలా వినోదముగా సంచరించు, హరిహరాదులకేది అసాధ్యముండును. వారు సిద్ధసంకల్పులు, కావుననే అనుకొనినదే తడవుగా వారు అవతారము లెత్తుచుందురు. (ప్రకాశముగా) అహా! దేవదేవా! ఏమి ఈ హరవిలాస వీచికాపరంపరలు.

సీ|| *తరుణేందు రేఖా సుధానంహిత జ్యోత్స్న*
*కుముదాబ్జ మాలతీగుచ్ఛమయ్యె*
*గంగాబంకా తరంగాల శారంగంబు*
*ధవళధావళ్యవృత్తంబునయ్యె*
*మకుట రుద్రాక్ష మాలికల సందోహంబు*
*రమణీయరత్నహారంబులయ్యె*
*కమనీయభూతి రేఖా విలాసమయంబు*
*వనువు కుంకుమల విభ్రాజమయ్యె*

గీ|| *వరత్రిశూలము నమరకిన్నెరగమారె*
*ఢమరుకంబెదురు బుట్టగా నమరియుండె*
*చిగురు కరిచర్మ చేలంబు చీరయయ్యె*
*సాంబశివమూర్తి ఎరుకల సానియయ్యె*

నారదుడు : మహాదేవా! ధన్యవాదములు.

ఎరుక (ఈశ్వ) : నారదా! క్షేమమేగదా!

నారద : ఆఁ.... క్షేమలాభంబులకేమిగానీ.... స్వామీ! ఏమిటి, ఈ విచిత్ర వేషధారణ.

ఎరుక : క్రాంతదర్శివైన నీకును విచిత్రముగానున్నదా నారదా? పావనియైన పార్వతి మనోభావముల గ్రహించుటకై విలాసముగా నీ ఎరుకలసాని వేషమును ధరించితిని.

నార : ఓహో! పార్వతీదేవికి పరీక్షయన్నమాట. అయినచో పరిణయము గూడా దగ్గరపడనున్నది గదా స్వామీ! అహా! ఎంత విచిత్రములు స్వామి, నీ లీలావిశేషములు.... ఇక నాకు సెలవొసంగుదురా?

ఎరుక : వెళ్లి రమ్ము నారదా......

నారద : నారాయణ ..... నారాయణ.....

పార్వతి చెలికత్తె : ఓయి - సింగీ... ఇటురావె... ఇటురా...

సింగీ : (వెనుకకుజూచి) ఓ.... ఓళ్ళసామె... వత్తుండ... వత్తుండ.

చెలి : అన్నివిషయాలు... నీవు బాగాచెప్పగలవటే... సింగీ...

సింగీ : ఓ... ఓళ్ళసామె... అదేందిసామె... అట్టంటావు... ఓ మొగంజూచ్చెబతా... చెయ్ జూచ్చెబతా... ఓ నడకజూచ్చెబతా... కులుకు జూచ్చెబతా... ఒకటేంటిసామె... పుట్టుమచ్చల్‌జూచ్చెబతా పూరోత్తరాల్జెబతాసామె.

చెలి : అయితే... రావేసింగీ... పోదాం... మారాణిగారికి చెప్పవుగానిరా (లోపలికి వెళ్ళిపోవును)

(తెర ఎత్తబడును)

పార్వ : (కూర్చునియుండును)

చెలి : (సింగితో ప్రవేశించును)

పార్వ : సింగీ మీదేవూరే!

సింగీ : ఓ ఓళ్ళసామె... మాకూరేడిది... పేరేడిది... చోటాడిది... పేటాడిదిసామె... అడవుల్లో... అగంతరాల్లో, సెట్టల్లో.. గుట్టల్లో... కొండల్లో... కోనల్లో... తిరిగేటోళ్ళం గదసామె.

పార్వ : అయితే... సింగీ... మనసులో అనుకొన్నమాట చెప్పగలవటే.

సింగీ : ఓ మాటేంటిసామె... వెయ్యిమాటలు జెవతా - జరిగేజ్జెవతా జరగబోయ్యేజెవతా - వుండేజ్జెబతా - లేంది జెవతా సామె. (అంటూ... బుట్ట క్రిందబెట్టి కూర్చుండును)

పార్వతి : సింగీ .... నీకు గద్దెచెప్పినందుకు యేమియివ్వాల్నే?

సింగీ : ఓళ్ళసామె... మీరు దొరోళ్ళు.... కడుపునిండాబువ్వెట్టిమంచిచీరసామె...

పార్వ : ఊ.... నరేలేవే... బువ్వకేంలేవే... కావల్సినంతపెడతాం చెప్పవే....

సింగీ : (చేతిలో బియ్యాన్ని అయిదుకుప్పలుబోసి)

ఓ సామి... ఓ సామి...

అఖిలాండ ... బెమ్మాండ ఆదినాయకుడ

అయిదుమొగములసామి - అరుదేరవయ్య

పుట్టించుగిట్టించు - పోసించుసామి

ముగ్గురుమూర్తుళ్ళ - మూలంపుసామి

వేగమేనాలోకి - వేంచేయవయ్య

ఎద్దుపైనెక్కేటి - ఏకాంబరేశ్వరుడ

మూడుములుకులసామి - ముక్కంటిసామి

ముగ్గురిలో కన్న - ముందైనసామి

గద్దనెక్కేసామి - కదలిరావయ్యా

నాల్గుమొగములసామి - నడిసిరావయ్యా

నాకులదైబాలు - గోత్రదైబాలు

ఆదినత్తెమ్మనా - మదిలోకూసోని

కలికిమదిలోమాట - పలికించవమ్మ

చదువులనరనమ్మ - సాగిరావమ్మ

దనలచ్చిమాలచ్చి - దాన్నెలచ్చమ్మ

కొల్లాపురమ్మనే - కోరినవేల

రారమ్మకాపాడి - రచ్చించరమ్మ

తల్లిగారివు ఎడు - దలనుకొన్నట్టి

మాటదబ్బరగాక - మరితనుగ్గాక

కల్లగా కుండమరి - పొల్లుబో కుండ

నానోటబలికించు - నాయమ్మలార

వుట్టెడు సాంబ్రాణి - పొగయేతునమ్మ

వసువు కుంకుమనీకు - బూసి పొర్థింతు

వచనములు అమ్మోయమ్మ - మారాణివైతావె మాలచ్చికొమ్మ - నువ్వనత్తెంగా - నీటుగా - దాటుగా - నేటుగా - మేటిగా - జగ్గుగా - నిగ్గుగా - హాయలుగా - బయలుగా - నీయిష్టదైబాలకు - నీగోత్రదైబాలకు - మొక్కేనుకొని, నీ చక్కని బంగారు సేత్తో - పుల్లముట్టమ్మ పుల్లముట్టు... (అని చేత్తోపుల్ల బట్టించును)

పార్వ: (పుల్ల ఎడమచేత్తో పట్టుకొనును)

సింగి : ఓ యమ్మో.., యమ్మ... ఒకటో, రెండో., మూడో, మూడుసార్లు మొక్కమ్మో.

పార్వతి : (మూడుసార్లుకుడిచేత్తో మొక్కును.)

సింగి : అమ్మో... యమ్మ... బంగారుసెయ్యి - బంగారు సెయ్యి

మాలక్ష్మినీచెయ్యి - మానిక్కెమమ్మ

అమ్మనీలచ్చనాలు - అందరకు లేవు

నరసమ్మలచ్చుమ్మ - సాములకు లేవు

పద్దినీ జాతి మా - బంగారు తల్లి

తలిదంద్రులున్నారు - తరలొచ్చినీకు

బావలుండగబోరు - బంగారు తల్లి

ఉన్నది జెవతుంద - ఊకొట్టు తల్లి

మాయలు జెప్పేటి - మనిసినిగాను

ఇదిగో దంపతిరేక - ఇట్టులుండాల

కలియకుండిన కీడు - కలిసిన మేలు

సంతతిరేకలు - చాలగలవమ్మ

వెయ్యేండ్లు అయున్సు - వెలదినీకమ్మ

అంతింతగాదుము - తైదువరేక

అలివేని అరసెయ్యి - అట్టులుండాలి

మనికట్టురేకలు - తనివిదీరాయి

మగడొత్తడమ్మయ్య - మామంచిమొగుడు

యేమారబోదునిన్నంటియేయుండు

సవతిపోరున నీకు జగడముందమ్మ

మామలు బావలత్తలు లేరునీకు

మగడుబంగారంటి - మనిసమ్మనీకు

చెలి : ఏవే సింగీ... ఇంతకీ మారాణిగారి మనసులో మాటరాలేదే

సింగీ : ఒళ్ళసామె... ఒకదానెంబడొకటొస్తదిసామె - నీవు తలంచినతలంపు - దాట్లో - తూట్లో - దబ్బర్లో - గిబ్బర్లో - తస్కో - బుస్కో - తక్కిడో - బిక్కిడో - పెద్దలకో - పేరంటాళ్ళకో — నర్లకో - దేవర్లకో ఎవరికంటదుగుతావె - ఎఱ్ఱినాతల్లి.

పార్వ : సింగీ... తనుక్కు - బునుక్కేందే

సింగీ : ఒళ్ళసామె... మేమేం ననుక్కున్నామ - సామె. అడవుల్లో అగంతరాల్లో - కొండల్లో - గుహాంతరాల్లో తిరిగేటోళ్ళంగఎసామె.

పార్వ : నరే! పోనీలేవె... ఏమిటోసెప్పు - అర్ధమౌతుందిలే.

సింగి : ఓ సామె... అయిదు మొగములసామె - ఆదినాయకుడ

వేగమేనాలోకి - వేంచేయవయ్య

వేంచేసి [illegible]ంగ - ఎలిబుచ్చవయ్య... ఓ యమ్మ - ఇవు ఏరునువ్వడిగేది - దాట్లు గాదు - దబ్బరగాదు - తనుగ్గాదు - బనుగ్గాదు - తక్కిడిగాదు - బిక్కిడిగాదు తంటగాదూ... మంటిగాదు ఒక్కమేలడుగుతావమ్మ... మేలడుగుతావెకొమ్మ.

పార్వ : ఆమేలు యేంటె సింగీ !

సింగి : మేలంటెమేలు - కీడంటెకీడు

మేలు మేలౌతుంది - కీడుకీడౌతుంది... మాకొల్లాపురమ్మ మేలెచెబుతుంది - (పుల్లబట్టుకోమని)

ఇదిగిదిగో... ఈ మూలనడిత్తే నత్తెమౌతుంది.

పార్వ: అయితే... సింగీ... ఆమేలు యెన్నిరోజుల్లో కలుగుతుందే

సింగి: రోజులంటేరోజులు - వారాలంటేవారాలు - నెలలంటె నెలలు - ఏళ్ళంటే - ఏళ్ళుగాదు పూళ్ళు గాదు నెలలుగాదు - వారాలు గాదు - రోజులంటే, రోజులు - మాబంగారు తల్లీ

పార్వతి : అంటె ఈరోజేనా ? సింగీ

సింగి: ఈ రోజా... రేవంటడుగుతావు - ఈరోజంటె - ఈరోజే

పార్వ : అయితే సింగీ - ఆమేలునాకు ఆడవారివల్ల జరుగుతుందా లేక మగవారివల్ల జరుగుతుందా ?

సింగి: అమ్మోయమ్మ... ఆడోళ్ళ - మగోళ్ళంటడుగుతావుతల్లీ! ఆడోళ్ళంటె ఆడోళ్ళు - మగోళ్ళంటె మగాళ్ళు - ఆడదంటె చెవ్వాకు - మగాడంటే గడ్డంజూపేను - ఇదిగిదిగో -మగరాయడేనమ్మ - మగరాయడమ్మ...

చెలి : ఆమగరాయుడెవరు ? ఇప్పటికి యేవైపుగా వుంటాడే...

సింగి : ఓయమ్మోయమ్మ... అతడెవరంటావు - ఎక్కడుంటాడంటావు... ఇదిగిదిగో ఈ వుల్ల ముట్టమ్మ. వుల్లముట్టమ్మ... ఆమగరాయుడుండేది - తూరుపా... వడమటా.. ఉత్తరమా... దచ్చినమాంటడుగుతావుతల్లీ... తూరువుగాదు... వరమటగాదు - దచ్చినంగాదు - గిచ్చినంగాదు. ఇదిగిదిగో యీవైపుంటాడమ్మ (అని ఈశాన్యం దిక్కుచూపించును)

పార్వ : ఆయన స్వరూపం చెప్పగలవాటే సింగీ...

సింగీ : ఓ... ఓళ్ళసామె... రూపంజెప్తా... గుణంజెప్తా... ఎత్తుజెప్తా... లావుజెప్తా... ఎక్కేదిజెప్తా - మొక్కేదిజెప్తా... ఎక్కడుండేదిజెప్త - ఎప్పుడొచ్చేదిజెప్తా... నీమననులోదంతజెప్తా.. నువుకట్టిడిసిన పాతిచ్చి - బురకడికంత బువ్వేయ్ తల్లీ!

పార్వ : బువ్వకేంకానీవే సింగీ! నీక్కావల్సినంత పెడతాంలేవే.

సింగి: అవునుతల్లీ - మాబంగారుతల్లే - నీమననులో వుండే మగరాయుడెట్లాంటివాడంటావు - ఎప్పుడొస్తాడంటావు. ఓయమ్మ - పుల్లముట్టమ్మ - పుల్లముట్టు -

*నీవుతలనుండేది - నీకైనసామి*

*నిన్ను చూశాడమ్మ - నిన్ను చూశాడు*

*నీమీది తలపుతో - నెమకుతుండాడు*

*నీమీది వలపుతో - నిక్కడుండాడు*

పార్వ : ఇక్కడా - ఇక్కడెక్కడున్నాడే - మాగ్గనిపించకుండా

సింగి : ఇక్కడంటే - యిక్కడ - ఈచోటు - ఇంకో చోటగాదు

అంతటావుంటాడు - అతడు మాతల్లి

నీవుతలనుండేది - నిజమైన సామి

తెల్లగా వుండాడు - దేవదేవుండు

ఎద్దునెక్కేవాడు - ఎఱ్ఱనాసామి

కుదుమిస్తేచేబట్టి - వండగంటాడు

అంతటావుంటాడు - అక్కడుంటాడు

ఇక్కడికొచ్చాడు - ఇప్పుడెల్తాడు

కోటలో వుంటాడు - కాటిలో వుంటాడు

చందమామనుబెట్టు - చర్మంబుగట్టు

కోటికి పడగెత్తు - కూటికేలేదు

వినముదింటాడుపా - యనము దింటాడు

ఆతడే మీయింటి - కల్లుడౌతాడు

నీవుతానైతాడు - తానెనీవైతావు

అనుమానమొద్దమ్మ - అతడెవత్తాడు

నవతిపోరొక్కటి - జరుగుతుందమ్మ

కొల్లాపురమ్మ నీ - కోర్కెసెపుతుంది

అవునంటావాతల్లి - కాదంటవమ్మా

యాలమిగిలిందమ్మ - ఎల్లొత్తనమ్మా

ఓ యమ్మ... మాయమ్మ.... బంగారుతల్లి - బురకడికంతబువ్వెట్టి పాతేలికియ్యమ్మ - నీపేరు సెప్పుకొని కడుపు నిండాతింటానమ్మ.

పార్వ : (లేచి) సింగీ వుండవే అన్నం తెస్తాను. (అని వెళ్ళి పోవును)

సింగీ : (ఈశ్వరునివలె) పర్వతరాజపుత్రీ! ఎంత అమాయకురాలవే - నాకొఱకై నీవెంతపరితపించితివో, నాకర్థమైనది. ఇకజాగు సేయతగదు. తక్షణమే నానిజస్వరూపము చూపెట్టి, నీమనోరథంబు దీర్చెద (అని అంటూ ప్రక్కకుబోవును)

ఈశ్వ : (ఈశ్వరుడు తన నిజస్వరూపముతో చాటుననుండును)

పార్వ : (పళ్ళెముతో సింగికి అన్నము తీసికొనివచ్చి) ఆహా! ఏమి నాజన్మసాఫల్యము - నాయెదుటనున్నది పరమేశ్వరుడా? పరమశివుడే ఎరుకలసానివేషంబున నన్ను పరీక్షచేయవచ్చెనా? అగన్పట్టునది నిజముగా భక్తలోకచింతామణియైన ఫాలలోచనుడేనా? లేక నామనంబు భ్రాంతివడుచున్నదా? కాదు, భ్రాంతికాదు - విభ్రాంతికాదు - నిజముగా పరమేశ్వరుడే.... ఆహా! ఏమియాభువనమోహన మహోజ్వల శరీరచ్ఛాయలు - శరీరచ్ఛాయలు ద్విగుణీకృతంబొనర్చు జటాఝూటన్న చంద్రకళాధీధితులు, చంద్రకళాకాంతులతో మేలమాడు, మనోహారకంఠహార ఫణీఫణాగ్రమణీమండనంబులు, మణిమండనంబున ప్రస్ఫుటించు దివ్యనిర్ఝరణీజలంబులును, నాకన్నులపండువసేయుచున్నవి. త్రిశూలధారివై తేజరిల్లు, దివ్యమంగళస్వరూపా! దేవదేవా! కరుణించి నన్నునుగ్రహింపవచ్చితివా? ఆర్తరక్షకా! దీనబాంధవా! భక్తపోషక! పతితపావనుడన్న బిరుదులు నీకే తగియున్నవి దేవా! స్వామి.

శా|| *వందే చంద్రధరా! పరాత్పరహరా! వందే జగన్మోహనా!*
*వందే సుందరరాజితాద్రినిలయా! వందే కృపాంభోనిధీ*
*వందే నిర్జరపూజితాంఘ్రికమలా! వందే త్రిశూలాయుధా*
*వందే దివ్య భుజంగభూషణధరా! వందే శివా శంకరా!*

(అని శివునిపాదములపై వ్రాలును)

ఈశ్వ : పార్వతీ! లెమ్ము నీకామిత ఫలసిద్ధియగుగాక!

హిమ : (హిమవంతుడు ప్రవేశించి) ఆహా! ఏమి నాపురాకృతపుణ్యవిశేషము, ఆదిశంకరుడు నాయింట అడుగుపెట్టెనా? నాగృహాముతో పాటు నాజన్మయు పవిత్రమైనది.... తల్లీ! అంబికా! నన్నునుగ్రహించి నీ మనోనాధుని నాయింటికే రప్పించితివా తల్లీ - నీ పూజతో బాటు నా జన్మమును సఫలమైనది. నాకుమార్తెగా జనించి నావంశమునే పావనమొనర్చితివమ్మా..... పరమేశ్వరా! భక్తలోకరక్షకా! మమ్మింకను పరీక్షంప వలసియున్నదా దేవదేవా....

ఉ|| *హేజగదీశ శంకరమహేశ సదాశివ విశ్వరూపవి*
*భ్రాజితరాజితాచలనివాసపరేశ, సురామరేంద్ర సం*
*పూజితపాదపద్మసితభూతిలలాట మహావిశిష్టరే*
*రాజకళావిభూషణ హరా! ఫణిహార! పురారిమ్రొక్కెదన్*

ఈశ్వ: హిమవంతా ! నీభక్తి ప్రపత్తులకెంతయో సంతసించితిని. నీకేదేని కోర్కెయున్నచో కోరికొనుము.

హిమ : పరమేశ్వరా ! మీవివాహామహోత్సవమునకేర్పాట్లు గావించెద, సెలవొసంగుడు...

నార : జగన్నాధుని వివాహామునకు, నీయేర్పాట్లెందుకయ్యా! హిమవంతా ! అన్నియు తమంతటవియేకాగలవు. ఇవిగో, కళ్యాణంబున ప్రధానపాత్రవహించెడి పూలమాలలు. విరించి విష్ణుదేవులు బృహాస్పతి సమేతముగా విచ్చేయుచున్నారు. అవిగో దేవదుందుభులు మ్రోగుచున్నవి. ఇక కావలసినది మాంగల్యము. మనుబ్రహ్మయే పరమేశ్వరుడు. పరమేశ్వరుడు మనుబ్రహ్మకావున మాంగల్యము పరమేశ్వరుని యొద్దనేయుండవచ్చు - (పార్వతివైపుజూచి) ఏమమ్మా పర్వతరాజపుత్రీ!

పార్వ : (తలవంచుకొని సిగ్గునభినయించును)

బృహాస్పతి
బ్రహ్మ పరమేశ్వరా ! ధన్యవాదములు.
విష్ణువు :

ఈశ్వ : సురపుంగవులారా! దయచేయుడు. దేవగురూ! పీఠమలంకరింపుము

బృహా : నీలకంఠా ! శుభసంశీమంబన్నారు పెద్దలు.

నార : అదేనయ్యా ! నేను చెప్పునది... "ఆలస్యాదమృతం విషం" అన్నారు మీ పెద్దలు

విష్ణువు : అన్నియుసంసిద్ధము... పెండ్లికుమార్తె... పెండ్లికుమారుడు - మరీ సంసిద్ధము. ఇంకెందులకయ్యా ఆలస్యము.

విష్ణువు : పరమేశ్వరా! ఇదిగో పూలమాల
(చేత బట్టుకొనును)

బ్రహ్మ : పర్వతరాజపుత్రీ! పూలమాలగైకొనుము.

పార్వ : (చేతబట్టుకొనును)

ఈ. పా. : (పూలమాలలు ఒకరికొకరు వేసికొందురు.)

బ్ర. వి.
నా. బృ : పాటపాడుచూ ఈశ్వరుని ప్రార్థింతురు.

పార్వతి : మంగళహారతి శివునికర్పించును.

సమాప్తి

శుభం శుభం శుభం

అసతోమా - సద్గమయా

తమసోమా - జ్యోతిర్గమయ

మృత్యోర్మా - అమృతంగమయ.